

గాజుల ఐత్తుడు

చిత్రకారుడు—శ్రీ పి. నాగేశ్వరరావు (కారెంపూడి)

సెప్టెంబరు 9 విడుదల





హైదరాబాద్ మూవీస్ వారి

# జల్సారాయుడు

....దర్శకత్వం....
తాపీ చాణక్య



సంగీతం : వేణు

నిర్మాత : పి. గంగాధర రావు



EARANKI

# ఉత్తరాలు

## హరివంశం

కం. శ్రీహరివంశము, వ్రాయును
మా పోరిత శివశర్మ మధురముగా, నో
హో హో యని ప్రజ మెచ్చగ!
శ్రీహరి యతని కిడుగాక సిరిసంపదలన్.

కె. వి. సూర్యనారాయణ
(గోండియా)

* * *

## తెలుగుతల్లి

ఈవారం (24-8-60) ప్రకటించిన బండి నాగరాజుగారి "తెలుగుతల్లి" చాలాతియ్యగా ఉంది (చదివేందుకు). తెలుగువాణి - తెలుగు వాణి తీర్చిదిద్దిన రచయితకు నా అభినందనలు.

కోటపాటి సత్యనారాయణ (గుణదల)

* * *

## పొట్టికథలు

ఈ మధ్య చందికలలోని పొట్టికథలు చాలా బాగుంటున్నాయి. ఈ వారం (24-8-60) చందికలో గోటేటి సీతాలక్ష్మి గారు వ్రాసిన, సమ్మెను గురించిన పొట్టి కథ చాలాబాగుంది. వారికి నా అభినందనలు.

ఆర్. యస్. రాజన్ (కందుకూరు)

* * *

## భోజనాలదగ్గర

ఏమండోయ్! మీ పత్రిక టపాలో మాకు సరిగ్గా మధ్యాహ్నం భోజనాలవేళ వస్తుంది. ఇహ, మావారికి భోజనం చేస్తూనే ఎడం చేతో పత్రిక చదివే అలవాటు పట్టుకుంది. "అదేమిటండీ" అంటే, పత్రిక ఓ స్పెషల్ రకం భోజనంట, ఆ భోజనంలోకి ఈ స్పెషల్ రకం వారానికోసారి, తప్పకుండా వుండాలిట.

ఈ వారం, కంచంముందు అలాగే కూర్చుని, ముద్ద మింగకుండా "బెన్-హర్" చదివి ఆ తర్వాత భోజనం చేయడం మొదలెట్టారు.

శ్రీమతి ఆర్. కె. ప్రేమవతి (యాళ్ళూరు)

* * *

## కార్టూన్లు

24-8-60 తేదీన వచ్చిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కార్టూను బొమ్మలలో అన్నిటికన్న ఒకటి చాలా బాగున్నది. అది ఏమనగా "ఆ సందు చివరలోనుంచి వెళ్ళగలనా?" అను కార్టూను. చాలా తమాషాగా ఉన్నది. ఆ బొమ్మవేసినవారు తమాషాకి వేయలేదు. ఉన్నది ఉన్నట్లు వేసినారు. ఇటువంటి మంచి, మంచి కార్టూనులకు మీ పత్రికలో అవకాశమిచ్చినందులకు మీకు నా ధన్యవాదాలు.

ఎమ్. రాధాకృష్ణ (హైదరాబాదు)

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక రాను రాను మరీ బాగుంటున్నది. ఈ మధ్యనే ప్రారంభించిన టోమస్ గారి వ్యంగ్యచిత్రాలు నా కెంతో నచ్చాయి.

మూలె సూరారెడ్డి (చిరాజుపల్లి)

* * *

"ఆగండి! ప్రేమకలాపం మరీ దగ్గరకు రానిస్తే ప్రమాదం!!—"

అన్న చిత్రం చాలా బాగున్నది. చిత్రకారునికి నా అభినందనములు.

ఎ. వి. రంగయ్య
(గుంటకల్లు)

* * *

## జీవనగంగ

"జీవనగంగ" విడవకుండా ఆద్యంతం చదివాను. ఇంతచక్కటి "సీరియల్" పాఠకులకు అందించినందుకు పత్రికకు, శ్రీ పురాణం సూర్యప్రకాశరావుగారికి నా హృదయపూర్వక అభినందనలు. ఒకపాత్రకి, ఇంకొకపాత్ర తీసిపోకుండా, చివరవరకు ఒకేవిధమయిన శైలిలో, పాఠకులకు పూర్తి సంతృప్తిని "జీవనగంగ" ఇచ్చిందని చెప్పకతప్పదు.

వి. వి. జె. కృష్ణ (ప్రొద్దుటూరు)

* * *

ది 24-8-60 ఆంధ్ర సచిత్రవారపత్రికలో "జీవనగంగ"లో సుగుణమ్మ గ్రామమునుండి ఆకాశరామన్న ఉత్తరాలు రెండు వచ్చినట్లున్నూ, రాధ వాటికి జవాబులు వ్రాసినట్లున్నూ రచయితగారు వ్రాసినారు. రాధ ఎవరిపేరు (చిరునామా) తో ఆకాశరామన్న ఉత్తరాలకు జవాబులు వ్రాసింది?

ఎమ్. చక్రపాణి (మంచిర్యాల)

* * *

## నేనూ వరంధామయ్యనే

ఈవారం ఉత్తరాలో శ్రీ విశేశ్వరరావు గారు వ్రాసింది చదివి అయనగారి విజ్ఞానానికి జాలిపడ్డాను. ఆంధ్రప్రదేశ్ లో వరంధామయ్యలు లేరా? నేను వరంధామయ్యనే. ఆంధ్రప్రదేశ్ అవతరించి నాలుగేళ్ళు అయినది గమనించమని మనవి.

ఎల్. వరంధామయ్య (కాకినాడ)

* * *

24-8-60 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో విశేశ్వరరావు గారు "ఆంధ్రప్రదేశ్ లో గత ఇరువది సంవత్సరములనుండి సంచారము చేయుచున్నను నేనెక్కడా వరంధామయ్య పేరుగల మనిషిని ఒక్కరినయినను చూడలేదు" అని వ్రాసినారు. ఆంధ్ర దేశములో యీ పేరు గలవారు కోకొల్లలు. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులలో ఒకరిపేరు "గోవాడ వరంధామయ్య గారు". దీనికి వారేమంటారు?

రవ్వా చారుమతీదేవి (విజయవాడ-2)

* * *

## నస్యం

17-8-60 పత్రికలో నస్యం కథ వ్రాసినారు. మా తాతగారు నస్యం వేస్తారు. కాని వారు వారపత్రికలను చదవరు. వారికి అది అంటే మంట. అట్టివారు నస్యం కథ చదివి చాలా ఆశ్చర్యపోయినారు. బాగుందన్నారు. కాని ఒక సందేహము. శాస్త్రులు గారు ఇచ్చిన గ్రౌర ఎరువును, శానీలారుగారు వేసుకొన్నారు. కాని వారికి అది వేసుకున్న తరువాత, నస్యం అయినది, గ్రౌర ఎరువు అయినది తెలియదా అని అడిగినారు.

జి. శ్రీనివాస శాస్త్రి (పైమాఘం)

* * *

## చిత్రసమీక్షలు

ముఖ్యంగా ఆంధ్రసచిత్ర వారపత్రికలో చిత్రాల సమీక్షలు అద్భుతంగా ఉంటాయి. ఎందుచేతో కొన్ని చిత్రాలు చూద్దామని అనుకోము. కాని వారపత్రిక సమీక్షలు మనస్సును థియేటరుకు పరుగెత్తిస్తాయి.

"ఐ వాన్ టు లివ్" చిత్రం చూద్దామని అనుకోలేదు కాని రివ్యూ చదివిన వెంటనే 'మిడ్ లాండ్ కు' పరుగెత్తకుండా ఉండలేక పోయాను.

ఆంధ్రపత్రిక చెప్పినట్లుగా 'గ్రాహం'గా సూసన్ హేవర్డ్ తన అనుభూతిని అద్భుతంగా ప్రదర్శించింది. చిత్రాల సమీక్షలు ఓ ప్రత్యేకాకర్షణ.

బి. జి. కృష్ణ (మద్రాసు)

* * *

## గుమ్మడి విదేశయాత్ర

31-8-60 వారపత్రికలో ప్రచురితమైన శ్రీ గుమ్మడివారి విదేశయాత్రానుభవాల వ్యాసం నన్నెంతో ఆనందపరచింది. అన్ని రకాలపాత్రలనూ అతిసహజంగా నటించే గుమ్మడిగారి నటనాకౌశల్యం, వారివ్యాసంలోని సహజత్వ సౌందర్యాన్ని మరింతవ్యక్త

---

జోళ్ళ దుకాణం యజమాని- ఈ జత నాలుగు రోజులు కరుస్తుందండి. తర్వాత బాగానే ఉంటుంది.

కొనడానికి వచ్చిన ఆసామీ- అయితే మరో నాలుగు రోజులు పోయాక వచ్చి కొంటాలెండి.

—'బాబు' (విల్లివాకం.)

---

వస్తోంది. అజ్ఞానం చదువుకున్న లక్షేష్వా వారితోపాటు నేనుకూడా ప్రయాణం చేస్తున్నట్లు అనిపించింది.

తంగెళ్ల పాండురంగశర్మ
(విజయవాడ-1)

* * *

## సినిమా, గిరీశం

మీ పత్రికలో సినిమా శీర్షికకు ఇంకా ఎక్కువ పేజీలు కేటాయించడం అవసరం. మన గౌరవనీయుడు అయిన మిత్రుడు గిరీశం లెక్చర్లు కూడా వరుసగా ప్రచురించడం అవసరం.

పి. ఎ. రెడ్డి (మద్రాపురం)

* * *

## కథలు

ఈ వారం (24-8-60) ఆంధ్ర సచిత్ర వారపత్రిక చక్కని గెటప్ తో శోభించింది. డా. అనంతలక్ష్మిగారు వ్రాసిన 'విధి నిర్ణయం కథ' బాగుంది. కాని ఇటువంటి తమాషా కథకు 'విధి నిర్ణయం' అనే బ్రహ్మాండమైన పేరు అంత సమంజసముగా లేదు.

పి. యువరాజ్ సింగ్ (పాకాల)

* * *

రావుగారి 'బ్రతుక నేర్చినవాడు' చాలా బావుంది. చదువుకునే రోజుల్లో ఉన్న ఆశ ఆ చదువయ్యాక ఎందుకు చదివినామా! అనిపిస్తూ వుంటుంది—ఈ నాడు డిగ్రీలు కొన్న వాళ్ళందరికీ.

వేణుగోపాల్ (చిత్తూరు)

* * *

తే 24-8-60 దీగల సంచికలో ప్రచురితమైన "బ్రతుక నేర్చినవాడు" కథ చాలా చక్కగా భావ గర్భితముగా ఉన్నది. గాని అవిధముగా లాయరు డిగ్రీ పుచ్చుకొని మొదట గుమాస్తాగా ప్రవేశించి పోనుపోను అధికార హోదాపొందినవారున్నారు. గాని యంత్రోరుగా జీవితమును అంకితము చేసినట్టు ఇంతవరకు వినలేదు.

బి. వి. రాజు (గుంటూరు)

* * *

"బ్రతుక నేర్చినవాడు" అనే కథలో అడ్వొకేటు సీతాపతికి మొదట అప్పు 5000 రూ॥లు అని వ్రాసినారు. తరువాత ఆదాయంలేకుండా నెలకి 200 రూ॥ల ఖర్చుతో మూడు సంవత్సరముల తరువాత అప్పు 8000 రూ॥ అని వ్రాసినారు. కాని లెక్కప్రకారము చూస్తే 8 సం॥ లకి రమారమి 7000 రూ॥ల మొదటి అప్పు 5000 మొత్తము 12000 రూ॥లు అగును కాని రచయితగారు ఈ లోపమును అంతగా గుర్తించక, చేతికి వచ్చిన అంకెలు వేసినట్లున్నారు.

జి. వెంకట్రావు (గొండముండ)

* * *

ఆగస్టు 31 వ తేదీ పత్రికలో ప్రచురించిన "మనసిచ్చినవాడు", "కోడలికి కథ తెచ్చిన ముప్పు", "ఒక ప్రశాంత దుం-రెండు పద్యాలు" అన్న మూడు కథలు చాలా బాగున్నాయి. మూడు కథలూ మూడు విధములయిన ఉత్తేజ భావాలను కలిగింపచేసినవి. రచయితలకు, ప్రచురణ కర్తలకు నా ధన్యవాదాలు.

యం. వి. గోపాల్ (విజయవాడ)

* * *

సాధారణంగా అన్ని కథలు ఒకేలా వుండే రోజుల్లో ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కథలుమాత్రం సంతృప్తిగా ఉన్నవి." 'ఉత్తరాలు' అనే శీర్షిక క్రింద పాఠకుల అభిప్రాయాలు చదవడానికి చాల ఉత్సాహంగా ఉంటుంది. అంతే కాదు. ప్రత్యేకించి ఆ ఉత్తరాలు చదవడంకోసం అనేకమంది పత్రికలు కొంటున్నారనడంలో అతిశయోక్తి లేదు.

మూరిశెట్టి కొండయ్య (ఉయ్యూరు)

## తెలుగుబావి

### శ్రీ వి. తోలేటి

తే. గీ॥ గౌతమీ కృష్ణ కావేరి గంతులేయ
కవన మూరెను తిక్కన్న గంటమందు
రాగమయమూర్తి త్యాగయ్య రక్తమందు
అద్భుతముగాదె జగతికి ఆంధ్రఘనత.

తే. గీ॥ తెలుగు నవ్వుల తీపికి తేనె లేద్య
తెలుగుకన్నుల కాంతికి తేజ మురిగె
తెలుగుసొంపుకు కతనాలు తెల్లబోవ
తెలుగువెలుగుకు తేరాజ దేవులున్న

తే. గీ॥ తెలుగువీరుల కండలతెన్ను వేరు
తెలుగురాజుల కత్తులతెగవు వేరు
తెలుగుయోధుల యుద్ధాలతీరు వేరు
కాకతీయుల కాంచనకాలమందు.

తే. గీ॥ తెలుగువనితకు సురలోకతేజ ముబ్బ
తెలుగుపాపను పావలదేవు దనిరి
కనకకుసుమాలు వికసించి కళలుపండె
కాకతీయుల కాంచనకాలమందు.

సీ॥ కదనగర్జనచేయు ఘననటంగుటూరిచే
తెల్గురాష్ట్రము నిల్పె తెలుగుతల్లి
భాషాప్రయుక్తముగు భావాలరూపమ్ము
తీరు జూపెను తొల్లి తెలుగుతల్లి
కేంద్రాధికారం వికేంద్రీకరించుట
కారంభరాష్ట్రమ్ము ఆంధ్రమాత
హరిజనార్యుని ముందు అందల మ్మెక్కించి
అధికార మందించె నానాంధ్రమాత

తే. గీ॥ ఎన్ని జరిగిన నీయింట నేమి యున్న
తుదకు నైరాశ్య మందందు తొంగిచూడ
కతము మాలోన దౌర్బల్యకర్మ మేన
తెలుపుమోదేవి రానున్న తెలుగు భావి.

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!



కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 దంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.

[illegible]

[illegible]

మీకు పళ్ళపొడి అలవాటైతే, కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా ఇన్ని లాభాలూ ఉన్నాయి ......ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది।




కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

[illegible]



# తెలుగు వెలుగులు 50

"నేనెట్లా మరవను నిన్ను!—అత్త్వల చెరకునుంచి నీ నవ్వులు, మబ్బుల వెనుక నుంచి నీ తొంగిచూపులు, నా కళ్ళల్లో నీ నీడలు, నా సుఖాలలో నీ స్పర్శలు, నా నిదట్లో నీ రహస్యాలు. ఎట్లా మరువను నిన్ను?

"ఇంకేనే నువ్వు, నిన్నెట్లా విడుస్తాను! హృదయంలో నే కట్టేసుకున్నావుగా ఎట్లా వదలతాను?' అంటే నమ్మను నీ దొంగ మాటలు. ఎక్కడ ఉన్నావు?

"నా మల్లే మోసపోయిన నిర్భాగ్యు లందరూ - నా శ్రీ ఏడుపులోంచి తలఎత్తి నవ్వుతున్నారు నన్ను చూచి.

"ఎవరిది తప్పు భగవాన్, నువ్వు చెప్పు పోనీ..."

ఇవేవో వీరమాహేశ్వరుల పారతరభక్తి వచనాలనో, తాళ్ళపాకవారి విన్నపాలనో, తరింద్రవెంద్రుని మూర్తిసిద్ధాంతకుందిలాసైన గీతామృతాంజలులనో భ్రమపడుతారు కదూ! కాదు. శ్రీ గుడిపాటి వెంకటచలంగారు "భగవాన్ రమణమహర్షిని సంబోధిస్తూ చేసిన" విన్నపాలలోని చిన్ని తరగలు.

ఏమిటీ విడ్డూరం! "దేవుడు, అధికారాలు, పాతర్లు, సౌఖ్యాలు, నీతులు, స్వర్గం, మర్యాదలు మూటకట్టుకొని వులికే మీకు" బాధ, మరణం, దరిద్రం, అశాంతి - ఇవన్నీ అర్థంకావనీ, "...మీ దేవుడు మీ డబ్బుకి దాసుడు. మీ నంగిపూజలకీ, స్వార్థప్రార్థనలకీ వశ్యుడు. దొంగభక్తవరాధీనుడు" అని సంఘంపై చండ్రనిప్పులు చల్లిన చలంగారేమిటి? ఈ విన్నపాల విలాపాలేమిటి?

పరిణామమనేది పరమాత్ముని సొమ్మా? ప్రకృతి సహజం; అందులోను మనస్సనే మణి ధగధగ మెరిసే మానవునికి సహజాతి సహజం. మనిషైనవాడు ప్రతివాడు ముసిడికాయలా ఎల్లకాలమూ ముడుచుకొనే వుంటాడా? మొదటి ఉత్తములూ, ప్రారంభా అయినవారు వయస్సు మళ్ళి మళ్ళిగానే ఉత్తములూ, అప్రారులూగా మారడంలేదా!

ఈయన స్వాప్నికులు! ఇతరులు "అ మహాపాత గోతిలోకి మెంపోలు తిప్పుకొని నగిషీలు చెక్కుతుం"డగా, ఈయనకలం మహాపాతకాల వయిలాపద్ధ్రులలో పాతబంధాలపై వలంపట్టి చిరచిరలాడుతూ అరిషడ్వర్గంలోని మొండటి రెండూ పాతకుల సర్వేంద్రియాలలోను వరదల్ని తొక్కట్టు చేసింది. "మైదానం"లో "దైవమిచ్చిన భార్య"తో "అనందం" పొందేట్టుచేసి తుదకు "విడాకులం" ఇప్పించి "మ్యూజింగ్స్"లో పడవేసింది. (వీరి కింద పడి నలిగిపోగా మ్యూజింగ్స్ అగిపోయాయి.) అయినవారికి, కానివారికీ "ప్రేమలేఖలు" వ్రాసి, "బ్రాహ్మణీకం" లోని మల్లిను అందరికొళ్లా నేళ్లాపారబోసినా, ఇతర మతాల లోపాలపైగాని, ఇతర మతాలవారి తప్పులపైగాని ఒక్కగీత గీయడానికైనా సాహసించలేకపోయింది.

సావిత్రికీ యమునికీ, చంద్రమతికీ మరొకరికీ సంబంధసంపర్కాలు కలిపిన ఈ కలం ఒక్క 'భానుమతి'ని ఎందుకో కరుణించి వదలింది. దుర్యోధనుని అదృష్టం! ధృతరాష్ట్రుని పుణ్యం!

దేశప్రజలందరినీ ఏకం చేసిన స్వాతంత్ర్యోద్యమంకాని, ఇతర ప్రధాన సమస్యలుకాని, ఈ కలానికి అంటుకోలేదు. భారతజాతి పిత అయిన గాంధీజీ అస్థికలను నదులలో నిమజ్జనం చేస్తున్నప్పుడు, కలరా మందరే ప్రతిఏట్లోనూ కలుపుతున్నారు అనే సంపరీతనాన్ని కూడా ఇది కక్కకపోలేదు.

ఏమైనా చలంగారికలం బలమైంది; భాగానురుని భల్లం వంటిది. తన పిరంగంతో ఎదుటివారి కండ్లకే కాక ఈయన కండ్లకే కొపెక్కించి, గుండెలు మండించి, కండలు కొవెక్క చేసింది; పలువురి కాపురాలను వల్లకాడు చేసింది. దీని పరిధికి చేరిన పిదప గురి తప్పినవారు అరుదు. ఈ కలం మరొకవిధంగా నడిచిఉంటే, "మాకర్మ మిట్లా కాలింది" అని మనం పరితపించే అవసరం ఉండేది కాదేమో!

దేనికైనా పరాకాష్ఠ తప్పదు. ఈ వజ్ర పిరంగం ఒకానొకదశలో వికలాంగమైంది. శ్రీ చింతాదీక్షితులవంటి సత్పురుషుడు ఈయనను రమణాశ్రమానికి నడిపించాడు. నేడు ఈయన "రమణాశ్రమమున పరచింతా పరాయణులై యున్నారు."

ఈ మార్పును కొందరు "సరే! సరే! వృద్ధనారీ పతివ్రతా బాపతులెండి" అని కటువుగా ఆక్షేపించడమూ కద్దు. కాని ఈ ఆక్షేపణ అపాతసత్యం. అత్యుత్కృష్టమైన జేదీ తగ్గక తప్పదు.

అంగులిమాలుడు తథాగతుని తత్త్వబోధతో అర్హతుడు అయినట్లు మనువు రాగాచలమైన చలంగారు రమణమహర్షి సత్యరమణీయ కృపాకటాక్షంతో విరాగాచలమయ్యారు.





# ఫలించిన కల

దైతా సీతారామశాస్త్రి

అప్పుడే హోటలులో భోజనం పూర్తిచేసి గదికి చేరాడు హుషారుగా ఈల వేసుకుంటూ రాము. తాళంతీసి లోపలకు అడుగు పెట్టాడు. స్విచ్ వేస్తే లైటు వెలగలేదు. ఇది ఏమి ఖర్మరా అనుకొన్నాడు. పోనీ కనీసం సిగరెట్టు కాల్చే అలవాటన్నా లేదు జేబులో అగ్గిపెట్టె ఉండటానికి. చీకటి సుగాఢ్యరంగా ఉంది. కాలు కదిలిస్తే ఏదో ఒకటి అడ్డం వస్తోంది. ధైర్యంచేసి అలమారు దగ్గరకు చేరాడు. బ్యాటరీలైట్ అన్నా దొరుకుతుందేమోనని అటు ఇటు తడిమాడు. చెయ్యి పెట్టగానే వ్రేలిమీదుగా ఏదో జర జరా ప్రాకిపోయింది. కొంపతీసి ఏ ఆప్త మిత్రుడు కాదుగదా అనుకున్నాడు. చేతికి జేబురుమాలు చుట్టుకొని అతి ప్రయత్నం మీద బ్యాటరీలైటును పట్టుకొన్నాడు. దాని సహాయంతో ఏమి జరిగిందో విచారిద్దామని బల్బు తీసి చూశాడు. ఫిలమెంటు తెగిపోయింది. దారం తెగిన గాలిపటంలా అల్లల్లాడుతూ వెక్కిరించింది నీ బ్రతుకూ ఇంతేనని. ఉసూరుమన్నాడు. క్రిందా మీదా పడి మెల్లగా ఫిలమెంటును అతికించి వెలిగించాడు. జిగేల్మని కాంతిని వెదజల్లుతూ పకపకా నవ్వింది. 'నాకు జీవంపోసి నాజీవితం దేదీప్యమానంగా వెలిగేటట్లు చేశావు. మరి నీ సంగతి ఏమిటోయ్' అని ప్రశ్నార్థకంగా చూచినట్లు అనిపించింది.

లైటు కాంతిలో పరిసరాలను పరికించాడు. అడుగు పెట్టినచోటల్లా పాదముద్రలు స్పష్టంగా పడుతున్నాయి. గది అంతా వస్తువులతో చిందరవందరగా ఉంది. ఎక్కడ పడితే అక్కడ దినపత్రికలు, మేగజైనులు దుమ్ము కొట్టుకొని పడిఉన్నాయి. ఏ మూల చూసినా సిగరెట్టు పీకలు. 'వెధవలు-వచ్చిన ప్రతివెధవా సిగరెట్టు పీల్చను, మూల గిరవాటు వేయను' అని తిట్టుకొన్నాడు కసిగా. కాదనలేని తన బలహీనతను నిందించుకొన్నాడు. గది మూలల బూజు తోరణములు కట్టి అలంకరించింది. ఏనాడైనా గదిని శుభ్రము చేసిన పాపం చేస్తేకదూ. తన బ్రతుకుకూడా ఇట్లా బూజు దుమ్ముతో నిండిపోవలసిందేనా. లక్షణంగా బి.ఏ.ప్యాసైనాడు. ప్యాసైన వెంటనే సునాయాసంగా రు. 150 ల ఉద్యోగం లభించింది. పైకి పోయే అవకాశాలు చాలాఉన్నాయి. కాని జీవితంలో ఎందుకు ఈ/నిరాశా,నిస్పృహాలు? ఏమిటి జీవితంలో లోటు అనుకొన్నాడు. దీనికి కారణం ఏమై ఉంటుంది అని ప్రశ్నించుకొన్నాడు. 'ఏది ఏమైనా సరే జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలి. ఈ ఇంటిని స్వర్గంగా మార్చాలి. ఇకనుంచి జీవితంలో నిర్లక్ష్యానికి తావివ్వకూడదు' అని తీర్మానించుకొన్నాడు.

అయితే దీనికి సరైన మార్గం? వివాహం చేసుకొంటే - ఛ - చాలు - పెళ్లి చేసుకొని కట్టుకొన్న భార్యను కన్న పిల్లలను పోషించలేక పడే బాధలు యమయాతనలు చూస్తూనే ఉన్నాంకదా. వైవాహికజీవితమంటే గులాబీల పాన్పు అనుకోవటం పొరపాటు. గులాబీలు ఉండవచ్చు. కాని వాటితోపాటు ముళ్ళూ ఉంటాయని మరువకూడదు. గులాబీలు ఇచ్చే ఆనందంకన్నా వాటి ముళ్లు కలిగించే బాధ అమితంగా ఉంటుంది. అయితే వేరు మార్గం, బ్రహ్మచారి జీవితమా? నవ్వుకున్నాడు రాము. బహుశః బ్రహ్మచారుల పాట్లు గురుతు వచ్చినట్లుంది. ఈ గది దొరికే ముందు తను పడిన యాతనలు కళ్ళముందు సాక్షాత్కరించినాయి. కాళ్ళు బలపాలు కట్టేటట్లు ఊరంతా గాలించాడు. క్రొత్తగా కొనుక్కొన్న చెప్పులు పూర్తిగా పనికిరాకుండా పోయినయి. ఎక్కడ ఇల్లు ఖాళీగా ఉందని తెలిసినా అక్కడకు ప్రత్యక్షమయ్యేవాడు. 'మీరు కాపురంతోనే ఉంటారు కదూ' అని సందిగ్ధంగా చూచేవారు ఇంటి యజమానులు. అది ప్రశ్నో లేక కాపురంతో ఉండాలనే నిబంధనో తన కర్థమయ్యేది గాదు. తన వాలకం కనిపెట్టి 'క్షమించండి బాబూ. వివాహితులై కాపురం పెట్టేవారికే ఇస్తాం' అనేవారు. ఏం తను మాత్రం పెట్టేది కాపురం గాదూ పెళ్లి కాకపోతే మాత్రం అని అందామని నోరు చివరదాకా వచ్చేది. కాని అవసరం తనది గనుక తమాయించుకొనేవాడు.

బ్రహ్మచారి అంటే ఎంత చులకన. భలే కోపం వచ్చింది. నిన్న కాక మొన్న పోస్టు క్రొత్త దంపతులుగదా చూసివద్దాం అని అట్టావెళ్లాడు గోపీ వాళ్లింటికి. 'గోపీ గోపీ' అని బిగ్గరగా పిలిచాడు అలవాటుకొద్దీ. 'ఎవరండీ' అంటూ వచ్చిం దొక అలవాటుకి. 'ఇక్కడ గోపీ అనేవా రెవరూ లేరండీ' అంది చురచురా చూస్తూ. ఇంతలో గోపీ బయటకు వస్తూ 'అరే అదేమిటిరా బయట నుంచుండిపోయావు. నీకేమైనా క్రొత్త ఇల్లురా. లోపలికి రా' అన్నాడు చెయ్యి పుచ్చుకొని. 'అబ్బే అదేమీ లేదురా. అసలు నువ్వున్నావో లేదో అని చూస్తున్నా' అన్నాడు కుర్చీలో ఆసీనుడవుతూ. 'సుశీ, ఇతను నా చిన్ననాటి స్నేహితుడు రాము మూర్తి కొంచెము తొందరగా కాఫీ చేసి తీసుకోనిరా' అన్నాడు. ఇప్పుడే పావు గంటలో చేసి తీసుకొస్తానండి అని విసవిసా నడిచి లోపలికి పోయింది ఆమె. గోపీ ఆమె దంద్రాగిన ముఖం పెట్టి ఏదో వ్రాసుకు న్నాడు. భలే ఆశ్చర్యంవేసింది తనకు. విశేషా తన చిన్ననాటి స్నేహితుడు. మన సులో మనసుగా ప్రాణంలో ప్రాణంగా మెలగినవాడు అనిపించింది. నాలుగు రోజు లలో ఎంతగా మారిపోయినాడు ! ఛీరా ! కాలవై కరిత్వం అని మనసులో ముక్కు మీద వ్రేలు వేసుకున్నాడు. గోపీ ముళ్ళ మీద కూర్చొన్నట్లు బాధ పడుతున్నట్లుగా భావించాడు రాము. ఇక ఉండటం భావ్యం కాదని 'వెళ్ళొస్తారా' అని లేచాడు. కాఫీ త్రాగి పోదువుగానిరా కూర్చో అని బలవం తము చేశాడు. 'లేదు బ్రదర్, ఇంతకుముందే త్రాగి బయలుదేరా' అని అబద్ధమాడేశాడు. 'పోనీ ఎప్పుడన్నా వస్తూఉండరా' అన్నాడు గోపీ. 'తరచు వస్తూ ఉండవద్దని చెప్ప రికా' అని మనసులో అనుకొని 'సరేలే' అని బయటపడ్డాడు.

ఆలోచనలతో వడుం వాల్చాడు రాము.

* * *

సాయంత్రం అయిదు కాగానే ఆఫీసు నుండి బయటపడ్డాడు. స్నేహితులు పిలు స్తున్నా వినిపించుకోకుండా ఇంటిముఖం పట్టాడు. వెనుకనుంచి నవ్వులు వినిపించాయి. లెక్క చేయలేదు. దారిలో ఓ లేత మల్లె పూలు తీసుకొని గబగబా అడుగులేసుకుంటూ ఇల్లు సమీపించాడు. వీధి గుమ్మంలో నుం చుని చిరునవ్వు చిందిస్తూ ఆహ్వానించింది అనూ. తన శ్రమంతా ఎగిరిపోయింది. దర హాసవదనముతో లోపలికి ప్రవేశించాడు. 'అనూ' అని పిలిచాడు కుర్చీలోకూర్చుంటూ. 'వస్తున్నానండీ' అంటూ ప్రవేశించింది తువ్వాలు, సబ్బు, చెంబులో నీళ్ళతో. మెల్లిగా బూట్లు విప్పబోసాగాడు రాము.

'ఉండండి నేను విప్పుతాను' అంటూ అడ్డంవచ్చింది అనూ.




చిత్రకారుడు—శ్రీ ఎస్. రఘురామారావు (విల్లివాకం)

'ఇంక అంతా దాణీగారి చిత్తమేనన్న మాట, సరే' అని కుర్చీలో జారగిలబడ్డాడు.

'ముఖం కడుక్కొందురుగాని రండి' అని చెయ్యిపుచ్చుకొని తీసుకొని వెళ్ళింది. తువ్వాలు అందిస్తూ 'తొందరగా బట్టలు మార్చుకోండి. టిఫిన్ కాఫీ తీసుకొస్తా'నని నిష్క్రమించింది.

తీయని ఆలోచనలతో కుర్చీలో ఆసీనుడై కేడియో ట్యూను చేయటానికి ఉపక్రమిం చాడు. ప్లేటులో టిఫిన్ టేబుల్ మీద పెడ్తూ 'తీసుకోండి' అంది అనూ కూడా ప్రక్కన వేరొక కుర్చీలో కూర్చుంటూ.

అనూ ముఖంలోకి చూస్తూ తన్మయుడై ఊహాజగతిలో విహరింపసాగాడు రాము. 'అనూ' అన్నాడు పద్మములాంటి ఆమె ముఖాన్ని దగ్గరకు తీసుకుంటూ. 'అబ్బ ఉండండీ. మరీ చిన్నపిల్లలై పోతున్నారు. ముందర టిఫిన్ పని చూడండి. తరువాత తీరి కగా చూద్దురుగాని చేనిక్కడే కూర్చుం టాగా' అంది చిలిపిగా. చెమ్చా నోట్లో పెట్టు కుంటూ 'ఎంత బాగుందీ' అన్నాడు. 'మీకు బాగుంది ఉత్సాహా లేక చెంచానా అండీ' అంది గట్టిగా నవ్వుతూ. అసలు సంగతి తెలుసుకుని 'నువ్వు' అంటూ నవ్వు కలిపాడు రాము.

'ఏమండీ ఆఫీసులో కూడా ఇట్లాగే పని చేస్తారాండీ' అంది అమాయికంగా ముఖం పెడుతూ. 'అప్పుడప్పుడులే' అన్నాడు తను మరింత అమాయికంగా ముఖంపెడుతూ. ఇద్దరూ నవ్వుకున్నారు.

'అనూ, జీవితం అంతా ఇట్లాగే ఆనం దంగా గడిచిపోతే వేరే స్వర్గం ఎక్కడున్నా ఉన్నదంటావా ? ఉన్నా మనకొద్దు!'

అంతలో 'రాము, రాము' అని కేక విని పించింది బయటనుంచి.

'ఎవడో దాపురించాడు అప్పుడే' అన్నాడు చిరాకుగా.

'అదేమిటండీ అట్లా అంటారు. మీ గోపీ గారు ఉన్నారు.'

'నువ్వు మంచివానివిగాని నేను ఇంట్లో లేనని చెప్ప కొంచెము సేపన్నా విశ్రాంతి తీసుకోనివ్వరు.'

'భలేవారండి. ఇంతకన్న మిత్రద్రోహం లేనిదేనా ఉంటారా. వెళ్ళి తలుపు తీసి లోపలికి తీసుకురండి. నేను కాఫీ తయారు చేసి తీసుకొస్తాను' అని వెళ్ళిపోయింది.

విసురుగా తలుపు తీయటానికి లేచి వెళ్ళాడు. తూలి తలుపుమీదపడ్డాడు. దెబ్బ తగిలినచోట గట్టిగా అదిమి పట్టుకొని నిల బడిపోయాడు. బాధగా కళ్లుతెరచాడు. కల కరిగిపోయింది. బొప్పిమాత్రం మిగిలింది. వళ్ళంతా చెమటతో తడిసిపోయింది. ఇదంతా కలేనా అని విసుపోయాడు. చుట్టూ కలయ జూచాడు. కిటికీలోనుంచి తొంగిచూస్తున్న చంద్రుడు పకపకా నవ్వాడు తన దీనస్థితికి.

* * *

యంత్రంలా ఆఫీసు నడిచిపోతోంది. గడి యారం పన్నెండు కొట్టింది. ఎండ తీవ్రంగా ఉందిబయట. లోపల ఫాను వేసుకుంటే వేడి గాలి, లేకపోతే ఉడకపోత. ఉసురుసు రంటూ పనిచేసుకొనిపోతున్నారు, యంత్ర లోని భాగాలవుతున్నట్లే తెల్లకాలరు బాబు లు. సుదురుమీద చెయ్యిపెట్టి చూసు కున్నాడు రాము. వేడిగా ఉంది. ఒంట్లో ఏమీ బాగుండలేదు. మధ్యాహ్నం సెలవు పెడితే బాగుండు ననిపించింది. ఆఫీసు ప్యూను పోస్టుప్యాక్ అప్పుడే తీసుకొని వచ్చాడు. తనకేమైనా ఉత్తరాలు ఉన్నా యేమో నని చూచాడు. ఏమీలేవు. 'మనకు రాసే వాళ్ళెవ్వరూ లేరనుకు' అనుకొన్నాడు. ఇంతలో పోస్టల్ ప్యూను 'ఎక్స్ప్రెస్ లెటర్ ఉందండీ' అంటూ అందించాడు.

తీసుకొని చించి చదవటం ప్రారంభిం చాడు.

"చిరంజీవి రామునకు ఆశీర్వచనములు.

నీ దగ్గరనుంచి క్షేమసమాచారములు తెలిసి చాలా రోజులైనది. నా ఆరోగ్యం కొంత మెరుగ్గా ప్రాణుటం చూసుకున్నా

పనిక త్తిడివల్ల వ్రాయలేకపోయానని తలుస్తాను. అయినా అందరూ ఉద్యోగాలు చేయటంలేదా? ఆరోగ్యం విషయం జాగ్రత్తగా చూసుకో.

"మా అమ్మకు వారం రోజులనుంచి సుస్తీగా ఉంటున్నది. జ్వరం నీరసం. డాక్ట

## ఫలించిన కల

రుకు చూపించి మందిప్పిస్తున్నాను. పూర్తి విశ్రాంతి కావాలని డాక్టరు చెబుతున్నాడు. నీకు తెలియనిదేముంది. విశ్రాంతి ఎక్కడి నుంచి వస్తుంది. ఇంటిపనంతా చేసుకోవాలి. అందులో చాదస్తం ఎక్కువ. ప్రతిదీ తనే స్వయంగా చూసుకుంటేనేగాని నచ్చదు. ఈ శరీరాలకు విశ్రాంతి ఒకేసారి లభిస్తుందేమో.

"నిన్ను చూచి చాలారోజులైంది. ఒక్క

పారి చూడాలని అంటోంది. నాలుగురోజుల పాటు సెలవుపెట్టి వెంటనే బయలుదేరి రావలసింది. నేను పెద్దవాడినైపోతున్నాను. నా ఒంట్లోనూ ఏమీ సరిగా ఉండటంలేదు. కొంచెం సెలవపాటు సెలవుపెట్టి విశ్రాంతి తీసుకొందామనుకుంటున్నాను. నీవు తప్పకుండా వస్తావుకదూ.

నీ తండ్రి,
నరసింహం."

కళ్లు చెమర్చినాయి. కని పెంచి ఇంతవాడిని చేసిన తల్లిదండ్రులకు తనే విధంగాను ఉపయోగపడలేదా అని మధనపడ్డాడు. ఎన్నాళ్ళని కష్టపడుతారు. పరిపరివిధాల ఆలోచనలు పోయినాయి. అసలే ఒంట్లో ఏమీ బాగుండలేదేమో జ్వరం మరీ ఎక్కువైపోయింది. వెంటనే నాలుగు రోజులకు సెలవు దరఖాస్తు వ్రాసి ఆఫీసరు దగ్గరకు తీసుకొనిపోయాడు. ఆఫీసరు చూచి 'ఏమిటయ్యా పెండ్లికాని కుర్రవాళ్లు. మాట్లాడితే ఒంట్లో బాగుండకపోవటమేమిటి? ఇంత వయస్సు వచ్చి సంసారము చేస్తున్నా మేమెప్పుడూ ఇటువంటిది ఎరగము' అన్నాడు కొంచెము సీరియస్‌గా హాస్యం మిళితం చేసూ.

'ఊ. సరే వెళ్లి వెంటనే వచ్చేయి. సెలవు పొడిగించకు' అన్నాడు ఆఫీసరు ఏ కళనున్నాడో.

హ్యాండ్‌బాగు, సూటుకేసుతో బయలుదేరాడు రామం స్టేషనుకు. ట్రైన్ ప్లాట్‌ఫారంమీద ఉంది. అక్కడనుంచే బయలుదేరటంవల్ల అంత జనసమ్మర్దంగా లేదు. ఖాళీగా ఉన్న ఒక కంపార్టుమెంటులో లోపలగా తన సూటుకేసు పెట్టి హ్యాండ్ బాగ్ చేత్తో పుచ్చుకుని బుక్‌స్టాల్‌వైపు నడిచాడు ఇంకా టైము వుండటంవల్ల.

'హాల్లో మూర్తీ' అన్నాడు శేఖర్.

'ఏదో ఊరిప్రయాణంమీద బయలుదేరినట్లున్నావే?'

'అవును బ్రదర్. విజయవాడ వెళ్తున్నాను. ఇంటికి దగ్గరనుండి రమ్మని ఉత్తరం వచ్చింది.'

'ఏమిటి విశేషం. ఏదన్నా శుభవార్త వినే అవకాశం ఈ సేవికి కల్పించు బ్రదర్.'

'దానికేం ముందర ఆ భాగ్యం నాకు కలగాలిగా!'

ఇద్దరూ నవ్వుకున్నారు. ఇంతలో గార్డు విజిల్ ఊదుతూ పచ్చజెండా ఊపాడు.

'వస్తా బ్రదర్' అంటూ గబగబా పెట్టెవద్దకు వచ్చి ఎక్కాడు రామం. శేఖర్ చెయ్యి ఊపుతూనే ఉన్నాడు కనపడినంతవరకు. సిగ్నల్ స్తంభాలు, చెట్లు, మనుష్యులు వెనుకకు పరుగెడుతున్నారు పోటీ పడుతూ. చిత్రంగా చూస్తూ క్షణకాలం ఉండిపోయాడు.

కూర్చొని మేగజైనులు తిరగవేద్దామని సీటు దగ్గరకు వెళ్లాడు. తన సీటు కెదురుగా ఒక అమ్మాయి చిన్నపిల్లవాడు కూర్చొని ఉన్నారు. సహజంగా ఆడపిల్లలంటే బెరుకు. కాలేజీలో కూడా తన చదువు ధోరణి తనదేకాని మిగతా విషయాలవైపు దృష్టి మరల్చేవాడు కాదు. అందుచేత సంకోచంగా నిల్చుండిపోయాడు. ఆమె ప్రక్కకు తిరిగి ముఖం కిటికీవైపు త్రిప్పుకుంది. సీటులో చతికిలబడి మేగజైనులో ముఖం పెట్టుకొని చూస్తున్నాడు. పత్రిక అడ్డం పెట్టుకుని ఆమెవైపు దృష్టి సారించి చూచాడు.

కోలముఖం. చిన్న నుదుట. కాటుకకళ్ళు. ఎర్రని పెదవులు. కోసదేరిన ముక్కు. పసుపుపచ్చని శరీరచ్ఛాయ. బక్కపలుచగా ఉంది. నీలిరంగు చీర ధరించింది. మెడలో గొలుసు తప్ప వేరే ఏమీ కనబడలేదు. గాలికి ముంగురులు ముఖంమీద దోబూచులాడుతున్నాయి. 'అందమైన పిల్లే' అనుకున్నాడు తనలో. ఒక చేతికి రెండు వరుసల బంగారు గాజులు' ఒక చేతికి రిష్టువాచి ఉన్నాయి. కాళ్ళకు స్లిప్పర్సు. బహుశా చదువుకుంటూ ఉండవచ్చు అనుకున్నాడు. పత్రిక తిరగవేస్తూ ఆలోచనలో పడిపోయాడు.

'అక్కయ్యా! అచ్చం బావలాగ ఉన్నాడు కదే' అంటూ చూపించాడు రామువైపు చిన్నపిల్లవాడు.

'ఛ. తప్పు' అంటూ వాడి నోరుమూసి రామువైపు చూసింది. రామూ ఆమెవైపు చూడటం తటస్థించింది. ఆమె కలవరపడింది.

'మరేం అక్కయ్యా! [illegible] పుస్తకంమీద అబ్బాయి తల్లక్రిందులుగా ఉన్నాడేమే?'

ఆమె తిరిగి చూసింది రామువైపు. మేగజైను తల్లక్రిందులుగా పుచ్చుకొని చూస్తున్నాడు. ముసిముసిగా నవ్వుకుంది.

తల్లక్రిందులై ఊహాజగత్తునుండి వాస్తవిక జగత్తులో అడుగు పెడుతూ ఆమెవైపు చూచాడు, కొంటెగా కూడకీసుకొన్న ధైర్యంతో. ఇద్దరిచూపులు కలుసుకొన్నాయి. వాడి తూపులనుబోలిన చూపుల తీక్ష్ణతను తట్టుకోలేక పరాజయాన్ని అంగీకరించింది ఆమె. సిగ్గుదొంతరలు వ్యాపింపగా ముఖాన్ని తిప్పుకొంది. రాము పదవకాశాన్ని జారవిడుచుకోకుండా ఆపాదమస్తకము వీక్షించి నేత్రోత్సవం చేసుకొన్నాడు. తనధైర్యానికి తనే అబ్బురపడ్డాడు. తనెప్పుడు ఏ స్త్రీని [illegible] విధంగా చూడలేదు. కాని ఈ రోజు ఇట్లాచేశానేమిటా అనుకున్నాడు. శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు.

'అక్కయ్యా! నాకేం కాఫీ కావాలి' అన్నాడు ఆ చిన్నపిల్లవాడు.

'రైలులో ఇప్పుడెక్కడనుండి వస్తుంది? ఇంటికివెళ్ళిన తరువాత త్రాగుదువుగాని' లే అంది ముందలింపుగా జరిగిన సంఘటనగూర్చి ఆలోచిస్తూ.

'కావు నా కిప్పుడే కావాలి' అని



"జ్ఞాపకముందా గురూ! మనం సెంట్రల్ జైల్లో కలుసుకున్నాం!"

చిత్రకారుడు—సి. లక్ష్మణరావు
(మచిలీపట్నం)

మారాం చేయుటం మొదలు పెట్టాడు. వినోదంగా తిలకిస్తున్నాడు రామం. ఏడుపు మొదలు పెట్టాడు బాబు.

'రా బాబు, వచ్చేస్టేషనులో తెచ్చి పెడతాలే' అని ఓదార్చాడు రాము. ఏడుపు మాని అతని ప్రక్కకు చేరాడు బాబు. ఆమె నిశ్చేష్టురాలై చూస్తూ ఉండిపోయింది.

'తప్పు ఇల్లారా బాబూ' అంది ఆమె.

'ఉహూ నేను రాను' అన్నాడు దీర్ఘం తీస్తూ.

స్టేషను వచ్చింది. కోలాహలంగా ఉంది. బాబును తీసుకొని వెళ్ళాడు రాము కాఫీ త్రాగటానికి. కాఫీ త్రాగి ఒక గ్లాసు కాఫీతో తిరిగి వచ్చారు.

'మీరుకూడా తీసుకోండి' అని అందించాడు.

'వద్దండి నాకు తాగాలని లేదు' అంది మెల్లగా.

'ఫరవాలేదండి. కాఫీ ఎన్నిసార్లయినా త్రాగవచ్చు. టానిక్‌లాంటిది' అన్నాడు హాస్యధోరణిలో చొరవతీసుకుని.

'అది కాదండీ' అంది సంకోచంగా.

'ఫరవాలేదు తీసుకోండి. ఇంతమాత్రానికేనా' అంటూ గ్లాసు అందించాడు.

'క్షమించండి మీకు శ్రమ ఇచ్చాను' అంది గ్లాసు ఖాళీచేస్తూ.

రైలు మాతమ్మే బయలుదేరింది నూతనోత్సాహంతో.

'మీరు ఎక్కడదాకా వెళ్ళుతున్నారు?'

'విజయవాడ.'

'అక్కడే బంధువు లెవరైనా ఉన్నారా?

(తరువాత పేజీ చూడండి)



ఇటీవల మద్రాసు వచ్చినప్పుడు రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ విద్యార్థులకు సందేశం ఆకాశవాణి కేంద్రంలో 'రికార్డు' చేసిన దృశ్యం.

న్యూఢిల్లీ లేఖ — శ్రీకృష్ణ

## పాలైబ్యాంకు విషయంలో

# రిజర్వుబ్యాంకు జాప్యానికి రాజకీయ నాయకుల బాధ్యత ఏమాత్రం?

పాలై సెంట్రల్ బ్యాంకు వ్యవహారాలు, అస్సాంలోని బెంగాలీల సమస్య, హిందీ స్థానం నేటికీ ప్రధానంగా చర్చలో ఉన్న విషయాలు.

పాలై సెంట్రల్ బ్యాంకులో డబ్బు దాచుకొన్నవారిపట్ల సానుభూతి ఉన్నదిక్కీ ఉండవలసినదే. అయినా వాస్తవాన్ని గుర్తించక తప్పదు. ఫిక్సెడ్ డిపాజిట్లమీద నూటికి నాలుగు వంతులకు మించి వడ్డీ ఇవ్వరాదని షెడ్యూల్డ్ బ్యాంకులు తమలో తాము కట్టుడిచేసుకొని ఉన్నవి. కాని పాలై బ్యాంకు నూటికి అయిదు వంతులు, అయిదున్నర వంతులు కూడా వడ్డీ ఇస్తూ ఉండేది. కాబట్టి ఐతే అయినా ఆ బ్యాంకు స్థితిగతులు సవ్యంగా లేవని డబ్బు నిలవచేసుకొనేవారు గుర్తించి ఉండవలసినది. ఇక పాలై బ్యాంకు మంజూరు చేసిన ఋణాల వ్యవహారం ఎంత సజావుగా నడిచిందో ముందు ముందు బయటపడక మానదు.

ఈ బ్యాంకు వ్యవహారంలో కేంద్ర ఆర్థిక శాఖ మంత్రి అవలంబించిన వైఖరి చాలా సమంజసమైనది. ఒకానొక బ్యాంకు డైరక్టర్లు, మానేజర్లు, వారి స్నేహితులు చేసిన అపరాధాలకు ప్రజలకు శిక్ష విధించడం ఏపాటి న్యాయం? తమ తమ నియోజకవర్గాల ఒత్తిడి మూలంగాను, కొందరు పత్రికా విలేకరుల ప్రోద్బలంతోను పార్లమెంటు సభ్యులు కొందరు ప్రవేశపెట్టాలని చూస్తున్న ఈ సంప్రదాయం చాలా ప్రమాదకరమైనది. పార్లమెంటు సభ్యులకు గనుక నిజంగా ఈ బ్యాంకు వ్యవహారంలో నష్టపడినవారిపట్ల సానుభూతి ఉన్నట్లయితే, బ్యాంకు ఉద్యోగులతో సమానంగా వారిని పరిగణించాలని ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయడంతోబాటు దేశంలో అమలులో ఉన్న కార్మిక చట్టాలక్రింద బ్యాంకు డబ్బులోనుంచి మొదట ఉద్యోగులకు ఇవ్వవలసినదంతా ఇచ్చివేసిన తరువాత మిగి

(61-వ పేజీ చూడండి)

# బెన్-హూర్

'హాల్డ్' చివర కూర్చున్న 'హోర్టేటర్' (గాలీ బానిసలచేత పని చేయించే వాడు) నౌకా గమనవేగం అంతకంతకు హెచ్చించాలని సూచిస్తూ ముద్గరాలతో శబ్ద ఫలకంమీద దరువు వాయిస్తూ ఉన్నాడు. వరుసగా 'యుద్ధవేగం', 'దాడివేగం', ఎదిరి నౌకను 'ఢీకొనే వేగం' సూచించిన దరువు. తోటిబానిసలతోపాటుగా ఉధృతంగా తెడ్డు వేస్తున్నాడు బెన్-హూర్.

అతని దృష్టిపథానికి అవతల ఉన్నవి మాసిడోనియన్ నౌకలు. వాటికి సమఉజ్జీలైనవారి నాయకత్వమూ ఉన్నది. రోమన్ నౌకల ఎత్తులకు పైఎత్తులు వేసినవి ఆ ఓడలు.

ఉభయపక్షాల నౌకలు ఒండొంటితో యుద్ధానికి తలపడే సమయం వచ్చినది. ప్రవాహవేగం, గాలికూడా తమకే అనుకూలంగా ఉండేటట్లు నేర్పుగా వ్యూహరించినవి మాసిడోనియన్ నౌకలు.

వ్యూహరచనలో అయినా నాయకత్వంలో అయినా పోరాటంలోనే అయినా మాసిడోనియన్ నౌకలు తీసిపోవని రోమన్ నౌకాబలాధిపతి క్వింటస్ ఏరియస్ గుర్తించాడు. విజయం ప్రసాదించమని మనసులోనే వరుణదేవుని ప్రార్థించుకొన్నాడు. తన ఆధిపత్యంక్రింద ఉన్న నౌకలను ఎదిరి నౌకలతో తలపడమని ఆదేశించాడు.

రోమన్ నౌకలు మహావేగంతో ఎదిరి యుద్ధనౌకలను సమీపిస్తున్నవి. రోమన్ నౌకాసైనికులు భల్లాలకు ఇనపకడ్డీలకు నూనెలో ముంచిన గుడ్డలు చుట్టి నిప్పుముట్టించి మాటిమాటికీ మాసిడోనియన్ నౌకలమీదికి విసురుతున్నారు.

ఏరియస్ ఆజ్ఞానుసారం 'హోర్టేటర్' గాలీ బానిసలచేత రెట్టించిన వేగంతో తెడ్డు వేయిస్తున్నాడు. నౌక అంతకంతకు అధికమైన వేగంతో ముందుకు పోతున్నది. మాసిడోనియన్ నౌకను చేరబోతున్నది.

రెండు నౌకలూ ఢీకొన్నవి. ఆ దెబ్బకు 'హాల్డ్'లో ఉన్న బెన్-హూర్, అతనితోటి బానిసలుకూడా పట్టుతప్పి బల్లలమీదనుంచి కూర్చున్నపళంగా వెనుకకు పడిపోయారు. తెడ్లు వారిచేతుల్లోనుంచి జారిపడిపోయినవి.

నౌక ఉపరిభాగంలో ఉభయపక్షాలవారు మహావేగంతో భీకరంగా అరచుతూ హోరాహోరీ పోరాటం సాగిస్తున్నారు. బానిసలు ఆ కోలాహలం వినడమే కాని చూడడానికి ఆస్కారం లేదు. పాల్గొనడానికి అవకాశం లేదు. అయినా గాలీ బానిసలు దుర్భరమైన తమ దుస్థితిని ఆక్షణంలో విస్మరించారు. ఉత్తేజితులైనారు. వారిలో ఉత్సాహం పరవళ్లు తొక్కుతున్నది. యథాస్థితిలో తిరిగికూర్చుని తెడ్డు చేతబట్టా-

కొన్నారు. అందరి ముఖాల్లో ఆనందం తొణికిసలాడుతున్నది.

అంతలో ఒక గాలీబానిస హృదయవిదారకంగా అరిచాడు. తెడ్డుఉన్న రంధ్రంలోనుంచి చూసినాడు అతడు. "ఎదిరినౌక మన పడవను ఢీకొనబోతున్నది. తెడ్లువేసి పడవ వెనక్కు నడపండి! వెనక్కు నడపండి!" అంటూ భీతితో గావు కేకలు పెట్టుతున్నాడు అతడు.

'గాలీ బానిసలు ఉన్న హాల్డ్' వెలుగు చొరరాని కూపం. ఉభయపక్షాలవారు ఒండొరులపై విసరుతున్న అగ్గి భరాటాల కాంతి మినహాగా మరేమీ కనిపించడంలేదు వారికి. మాసిడోనియన్ నౌక తమనౌకను ఢీకొనబోతున్నదన్న మాట వినపడేసరికి వారందరికీ మతి చలించినటు అయినది.

శత్రునౌక ఢీకొంటే జరిగేదేమిటో వారందరికీ బాగా తెలుసు. నౌకాముఖం ఇనుము తాపినది. దానితాకిడికి గురి అయ్యేభాగంలో ఉండేవారికి పట్టేగతి ఏలాంటిదో వారందరికీ తెలిసినదే. ఇనుము తాపిన నౌకాముఖం తాకిడికి గురి అయ్యేవారు ఉన్నపళంగా ఆ క్షణంలోనే ప్రాణం కోల్పోతారు. తప్పి బయటపడినవారికీ సంకెళ్ళతో సముద్రంలోపడి చావడమే గతి.

బతికినంతకాలమూ దుర్భరమైన యాతన అనుభవించక తప్పని దౌర్భాగ్యజీవులకు అలాంటి ఆకస్మిక మరణం స్వర్గతుల్యమే. అయినా అలాంటి మరణం కావాలని కోరుకొనేది ఎవరు?

తోటివారందరూ మతిభ్రష్టులై అంధకారంలో తన్నుకొంటున్న భయంకరమైన ఆ ముహూర్తంలో బెన్-హూర్ తనకర్తవ్యం గుర్తించాడు. 'ఆ హాల్డ్'లో సంకెళ్ళనుంచి విముక్తుడై ఉన్న బానిస అతడు ఒక్కడే. కూర్చున్న చోటనుంచి ఒక్క దూకులో పైకి లంఘించాడు. రెప్పపాటుకాలంలో ఆకొన్న పులిలా బానిసల ప్రధాన అధికారిమీద విరుచుకుపడ్డాడు. అతనివద్దనే బానిసల సంకెళ్ళవిప్పే తా





## ఫట్ అంటే ఫట్

(మొదటి బహుమతి రు 10 లు)

నేను మూడవ ఫారం చదువుతున్న రోజులవి. మాకు అప్పుడు డ్రాయింగ్ పీరియడు. మా డ్రాయింగ్ మాస్టారు డ్రాయింగ్ చెప్పకుండా కథలు ప్రారంభించాడు. ఆయనకు చాకలి బానంతిబొజ్జ. దానిమీద లాగూ లోపల షర్టు వేసుకుని మరీ స్కూలుకు వచ్చేవాడు. ఆ వేళ ఒకకప్ప కథ చెప్పుతు పోతున్నాడు. ఒక కప్పపిల్ల ఒక ఎద్దును చూసి గుండె బేజారెత్తి తల్లిదగ్గరకు ఒక్కదూకు దూకి "అమ్మా! నేను పెద్దజంతువును చూశాను అంది". మాస్టారుకు కథ చెబుతూ అభినయము కూడా చేసే అలవాటుంది. దూకటం అవీ చేస్తున్నాడు. క్లాసంతా చాలా శ్రద్ధగా వింటున్నారు ఆయన చెప్పేకథను. "అతల్లి కప్ప, ఈమాత్రం ఉంటుందా, అని దాని పొట్టను బిగపెట్టింది. పిల్లకప్ప, ఇంకా పెద్దది, అంది. ఈమాత్రం ఉంటుందా, అని గట్టిగా బిగపెట్టేసరికి దానిపొట్ట ఫట్‌మని బ్రద్దలైంది" అని మా మాస్టారు చెబుతూ ఆయనకూడా 'ఈమాత్రం ఉంటుందా' అని గట్టిగా బిగపెట్టి కథ చెప్పేస్పులో అభినయించేసేసరికి ఆయనపొంటు గుండీలు ఫట్‌మని తెగిపోయాయి. క్లాసంతా గొల్లుమన్నారు.

కరిగొట్ల శ్యామసుందరరావు
(శెట్టివారి గూడెం)

* * *

## గొడుగుల దొంగ

(రెండవ బహుమతి రు 5 లు)

మొన్న మాతాతయ్య ఒకసారి గొడుగులు బాగుచేయిద్దామని నాలుగో, ఐదో పాతగొడుగులు ఒకటే కట్టకట్టుకొని, మాది పల్లెటూరు కావడంవల్ల, అక్కడ ఎవరూ గొడుగులు బాగుచేసేవారు లేకపోవడంవల్ల, బస్సుమీద భీమవరం వెళ్లారు. అవి అక్కడ ఇచ్చేసి మరల తిరిగివచ్చేశారు. ఇంకో రెండురోజులయినతర్వాత అవి తీసుకొని రావటానికి బస్సుమీద వెళ్లారు. మా తాతయ్యకు మతిమరుపు ఎక్కువ. ఆయన వెళ్లేటప్పుడు గొడుగు పట్టుకెళ్లలేదు. ఆయన బస్సు దిగేటప్పుడు ఆయనగొడుగే అనుకొని బస్సులో ఉన్న ఒక ముసలమ్మ గొడుగు చంకను పెట్టుకొని వెళ్లుతున్నారు. అది ముసలమ్మచూసి 'దొంగదొంగనాగొడుగుఎత్తుకుపోతున్నాడ'ని కేకవేసింది. అప్పటికిగాని తెలియలేదు మా తాతయ్యకు తానుచేసినపని. తర్వాత ఆగొడుగులు బాగుచేయించుకొని తిరిగి బస్సుమీద వచ్చేస్తున్నారు. ఆముసలమ్మకూడా అదే బస్సులో ఎక్కింది. మా తాతయ్య చేతిలోని గొడుగులను మాచి 'అబ్బా! ఇవ్వాళ చాలా గొడుగులు ప్రోగైనయ్యే' అంది. అప్పుడు మా తాతయ్యమొహం ఆముదం త్రాగినవాడి ముఖంలా తయారయిందని వేరే చెప్పాలా!

ఎమ్. వి. వి. ఎస్. రామచంద్రరావు
(భీమవరం)

* * *

## పరధ్యానంలో పొరపాటు

(రెండవ బహుమతి రు. 5 లు)

నేను ఒకరోజున బస్సులో ప్రయాణం చేస్తున్నాను. నాకు కొంచెం దూరములో ఒక ఆమె ప్రయాణము చేస్తూంది. ఆమె, ఆమె ప్రక్కామె కలిసి గట్టిగా మాట్లాడుకొంటున్నారు. ప్రక్కామె మొదటామెను ఏదో అడిగింది. దానికి సమాధానంగా మొదటి ఆమె "నాకు ఏడు చీరలు, పిల్లలకు బట్టలు ఇచ్చారు" అని చెపుతోంది. సరిగ్గా అదే సమయాన నా దగ్గరకు టిక్కెట్టుకలెక్టరు వచ్చాడు. అతడు ఇవే మాటలు అనగా "నాకు ఏడు చీరలు, పిల్లలకు బట్టలు ఇచ్చారు" అని వ్రాసి నాకు మూడు టిక్కెట్లు ఒకే వరుసలో ఉన్నవి ఇచ్చాడు. నాకు ఆశ్చర్యమేసింది. నే నిచ్చింది ఒక టిక్కెట్టు. అతను నాకు మూడు టిక్కెట్లు ఇచ్చేసరికి దానిని చదివేశాను. నాకు నవ్వాగ లేదు. దానిని మళ్లీ టిక్కెట్టుకలెక్టరుకు చూపించాను. అతను పైకి చదివేశాడు. బస్సులో ప్రయాణికు లంతా నవ్వడం మొదలెట్టారు. కొందరు మాత్రము "పరధ్యానంలో పొరపాటు" అని అన్నారు.

—సి. హెచ్. సత్యవతి (నర్సీపట్నం)

* * *

## టిక్కెట్ అడిగితే తంటా

(రెండవ బహుమతి రు 5 లు)

ఒకసారి నేను విజయవాడలో ఉన్న మా చిన్నాన్న దగ్గరికని ఖమ్మంలో రాత్రి 11 గంటలకు హౌరా ఎక్స్‌ప్రెస్ ఎక్కి వెళ్లుతున్నా. సీటు లేకపోవడంవల్ల నేను ఇంకా ముగ్గురం నిల్చునే ఉన్నాం. మిగతా ప్రయాణీకు లంతా హాయిగా వారి వారి పడకల్లో నిద్రపోతున్నారు. మధిర స్టేషనులో ట్రైన్ ఆగింది. తిరిగి కదలబోయేముందు మా కారేజీలోకి టికెట్ కలెక్టర్ ఎక్కాడు. మా ముగ్గురి టికెట్స్ చూచాక మా ఎదురుగా ఉన్న సీటుమీద సూటులోవున్న ఒకవ్యక్తిని లేపుతూ టికెట్ అడిగాడు. ఆవ్యక్తి ఉలిక్కిపడి లేస్తూ "టికెట్ కావాలా" అంటూ కుడికాలు బూటు విప్పటం మొదలెట్టాడు. దాంతో టికెట్ కలెక్టర్ హడలెత్తిపోయి "సారీ, మిస్టర్ పడుకోండి", అంటూ అతన్ని దాటిపోయాడు. ఆ ఆజానుబాహుడు తిరిగి నిద్రపోయాక, "పెద్దమనుషులంటే ఈలాగే ఉంటారు. అతను చూడబోతే పెద్ద ఆఫీసర్ లా ఉన్నాడు. టికెట్ లేకుండా ప్రయాణంచేస్తూ పైగా టికెట్ అడగటానికి వచ్చిన టికెట్ కలెక్టర్ను బూటువిప్పి తన్నటానికి తయారయ్యాడు. రోజులుమారాయి నాయనా, మనుషుల్ని అని ప్రయోజనం ఏముందంటూ" లెక్చర్ దంచాడు మాలో ఒక పెద్దమనిషి నెమ్మదిగా.

విజయవాడ స్టేషన్‌లో ట్రెయిన్ ఆగింది. అంతకుముందు మా క్యారేజీలోకి వచ్చి వెళ్లిన టి. సి. హడావిడిగా ముగురు కానిస్టేబిల్సుతో మళ్ళీ మా కారేజీలోకి ఎక్కాడు. తిరిగి వ్యక్తివద్దకెళ్లి "ఏయ్ మిస్టర్! దయచేసి టికెట్ చూపిస్తారా" అంటూ లేపి అడిగాడు టి. సి. ఆ వ్యక్తి మళ్ళీ లేచి బూటువిప్పటం మొదలెట్టాడు. దాంతో టికెట్ కలెక్టర్, ముగ్గురు కానిస్టేబిల్సు నాలుగడుగులు వెనక్కి వేశారు. మేము ముగ్గురం భయాశ్చర్యాలతో విలక్షణ పోజులో ఉన్న ఆరడుగుల ఆజానుబాహునివైపే చూస్తున్నాం. కాసేపటికి కుడికాలి సాక్సులోనుండి టికెట్‌ను బయటికి తీశాడావ్యక్తి. టికెట్ కలెక్టర్ కానిస్టేబుల్సుతో సహా ముఖాలు తెల్లగా ఐపోయాయి. టికెట్‌ను తీసుకోకుండానే గబగబా దిగి వెళ్లిపోయాడు కానిస్టేబుల్సుతో.

మేము ఆవ్యక్తి దగ్గరగాపోయి సంగతంతా వివరించి చెప్పినాక అతను, "టికెట్ పోకుండా ఉండాలని నేను సాక్సులో పెట్టానుగాని, వాళ్ళను నే నెందుకు తంతానండీ" అంటూ గొల్లున కడుపుపట్టుకొని నవ్వటం మొదలెట్టాడు. మేము, అక్కడ పోగైన జనం అంతా నవ్వకుండా ఉండలేకపోయాం.

జి. వి. ప్రసాద్ (నల్‌గొండ)

# ఆదర్శం

'కాశీరాజు'

"ప్రభాకర్,

మీరు యౌవనోత్సాహంలో జ్యోతిని ప్రేమించారు. ఆమె కల్లబొల్లి మాటలు విన్నారేమో! ఆమెను పెండ్లి చేసుకోవటానికి సిద్ధపడ్డారు. మీ ఆదర్శం శ్లాఘనీయమే. కాని, జ్యోతి భర్త ఆత్మహత్య చేసుకొన్నాడు. కారణం జ్యోతే అని గ్రహించండి. మేలుకోండి.

ఇట్లు,
మీ శ్రేయోభిలాషి,
ఆకాశరామన్న."

ఉత్తరాన్ని మేజామీద ఉంచి తలవంచి ఉత్తరంగూర్చి తలపోస్తున్నాడు ప్రభాకర్. అతని మనస్సు పరిపరివిధాల పరిగెడుతూ ఉంది. జాబులోని విషయాల్ని అట్టే త్రోసి పారెయ్య కూడదనుకొన్నాడు.

ఒక్కొక్కప్పుడు ఇలాంటి ఆకాశరామన్న ఉత్తరాలే నిజాన్ని అందిస్తూంటాయి. ఇంతెందుకూ మొన్న కేంద్రప్రభుత్వ ప్రత్యేక అవినీతినిర్మూలన శాఖ కందిన ఆకాశరామన్న ఉత్తరాలలో నూటికి ముప్ఫై నిజమైనవని తేలినదట!"— ఆలోచనా సముద్రంలో మునిగి తేలుతున్న ప్రభాకర్ టేబుల్ దగ్గరికి జగన్నాథంగారు మామూలుగా వచ్చారు. జగన్నాథంగారిని చూచి తత్తరపాటుతో ఉత్తరాన్ని మడిచి జేబులో కుక్కుకున్నాడు ప్రభాకర్. అయినప్పటికీ జగన్నాథంగారా ఉత్తరాన్ని చదివే అవకాశం లేకున్నా, అందులోని అక్షరాల్ని చూచి "ఆ ఉత్తరంలోని దస్తూరీ మా సుశీలది లాగుందే!" అన్నారు ప్రభాకర్‌తో తన కున్న చనువును పురస్కరించుకొని. కొంచెం



తెప్పరిల్లుకొని జాబును జేబులోకి పూర్తిగా తోసేస్తూ, "కాదు లెండి. కాకినాడనుంచి మా అత్తయ్య వ్రాశారు. ఆడవాళ్ళ దస్తూరీలు ఇంచుమించు ఒకేలా ఉంటాయికదండీ" అని బదులు చెప్పాడు ప్రభాకర్ సమయస్ఫూర్తితో.

జగన్నాథంగారు, ప్రభాకర్ ఇద్దరూ కలిసి భోజనానికి బయలుదేరారు.

నడచి వెళ్ళుతున్నాడేగాని ప్రభాకర్ కు ఆ ఉత్తరంగూర్చి తలపోతే. 'సుశీలే రాసిందేమో! జగన్నాథంగారి దగ్గర తన తెలివి ఉపయోగించకపోయుంటే సుశీల చిక్కుకొని ఉండేది. తన రంగుకూడా బయట పడుండేది. సుశీల కెంత ఈర్ష్య! తను ఆదర్శ ప్రాయంగా వాళ్ళఅక్కను పెళ్ళిచేసుకోవటం చదువుకొన్న సుశీల కిష్టంలేదు. సుశీల తనను ప్రేమించిందని తనకు తెలుసు. ఆదర్శ జీవిగా బ్రతకా లనుకొన్న తనకు ఆదర్శం ఈ వేరక తన్నులుమాత్రం కొంచెంలో తప్పి తున్నాయ్. జ్యోతివిషయం ఏయే పరిణామాలకు దారితీసి ఆమె జీవితంలో తాను చిచ్చుపెట్టిన వాడవుతాడో!

కాలేజీలో చదివేరోజుల్లో సునీజగూర్చి పొరబాటుపడ్డాడు. ఇప్పుడాసంఘటన ప్రభాకర్ మనోనేత్రాలముందు మెదిలింది.

కళాశాల వార్షికోత్సవంరోజున "కన్యాశుల్కం" నాటకాన్ని ఉత్సాహంతో ప్రదర్శించారు. నాటకంలో పాల్గొన్న గిరీశం పాత్రధారి ప్రభాకర్ కూ బుచ్చమ్మ పాత్రధారిణి సునీజకూ ప్రత్యేక బహుమతులు లభించాయ్.

నాటకం ముగిసింతర్వాత కళాశాల విద్యార్థిసంఘ కార్యదర్శి ధన్యవాదా లర్పించాడు. నటీనటులు తమ ముఖాల వున్న కోటాల్ని శుభ్రపరచుకొని తలలు దువ్వుకొని ఇళ్ళకు వెళ్ళబోతున్న వాళ్ళను వారించి 'టీ' త్రాగటాని కాహ్వానించాడు ప్రభాకర్. 'టీ' త్రాగేటప్పుడు సునీజ నటనను మెచ్చుకుంటూ ఆమెను ప్రత్యేకంగా అభినందించాడు ప్రభాకర్ నాటకోపసంఘాధ్యక్షుని హోదాలో.

రాత్రి ఇంటికెళ్లేటపుడు "సునీజ కింత చిన్నవయస్సులోనే వైధవ్యం సంప్రాప్తించిందే" అనుకొన్నాడు ప్రభాకర్.

మరునటి రోజు ప్రభాకర్ కాలేజీ కెళ్లేటప్పుడు అనుకోనట్టు సునీజ ముందువెళ్ళుతూండడం తటస్థించింది.

అప్పటికే కాలేజీ సమీపించాడు.

ముందున్న పరిచయంతో ముందుకెళ్ళి సునీజను పలుకరించాడు ప్రభాకర్.

"సునీజా! నీగూర్చి నా కొక సందేహం ఎప్పటినుంచో తీర్చుకోవాలనుంది. చిన్న వయస్సులో నీకు పాపం! వివాహం

# ఆదర్శం

కావలిస్తే నే నేర్పాటు చేస్తా"... నీళ్ళు నమిలాడు ప్రభాకర్.

ఈలోగా కాలేజీ ఆవరణంలో అడుగు పెట్టడం సునీజ "లేడీస్ రూమ్" వైపు విస విసా వెళ్ళిపోవడం జరిగింది.

'బేంకింగ్' క్లాసు జరుగుతున్నప్పుడు బంట్రోతు వెంకటస్వామి వచ్చి ప్రభాకర్ ను ప్రిన్సిపాల్ గారు పిలుచుకొని రమ్మన్నారని పిలుపు తెచ్చాడు.

ప్రిన్సిపాల్ గారి గదిలో సునీజ ఉందని వెంకటస్వామి చెప్పగానే క్రితంరోజు తను నిర్వహించిన నాటకాన్ని ప్రశంసించేందుకు ప్రిన్సిపాల్ గారు పిలిపించి ఉంటారనుకొన్నాడు ప్రభాకర్.

పెళ్ళివారు వచ్చి పిల్లను చూచినతరువాత పెండ్లికుమారునితండ్రి పెండ్లికుమార్తె తండ్రితో "చూడండి, మీ అమ్మాయికి పాటలు వచ్చునన్నారుకదా. ఏదీ ఒకపాట పాడమనండి" అన్నాడు.

పెండ్లికూతురు తండ్రి వెంటనే "మాఅమ్మాయికి పాటలువచ్చునన్నానుకాని పాడగలదు అని లనలేదుగదాండీ" అన్నాడు.

—'రాధ' (పూనా)

"ప్రభాకర్! ఉదయం కాలేజీ కొచ్చేటప్పుడు సునీజకు పెండ్లి ఏర్పాటు చేస్తానంటూ వేళాకోళం చేశావట. దీనికి నీ సంజాయిషీ ఏమిటి?" గదమాయించారు ప్రిన్సిపాల్ గారు.

ప్రభాకర్ విధేయతను కనబరుస్తూ "అవును సార్. ఆమె పునర్వివాహానికి మా సంఘం ద్వారా ఏర్పాటు చేయిస్తాననే తలంపుతో చెప్పిన మాటలు నిజమండీ" అని బదులిచ్చాడు.

ప్రిన్సిపాల్ గారు వచ్చిన నవ్వు ఆపుకోలేక "కామెర్లు వచ్చిన వానికి లోక మంతా పచ్చగా కనుపించినట్టు! నీవు బొట్టు పెట్టుకొని వనితలను విధవలనుకొంటున్నావు, వారికి సహాయం చేయా లనుకొంటున్నావు! నీ చిత్తశుద్ధి ఎంతో శ్లాఘనీయం. కాని. సునీజ గూర్చి నీవు పొరబాటు పడ్డావు. ఆవిడ క్రైస్తవ వనిత. ఇక మీరిద్దరూ వెళ్ళొచ్చు" అంటూ నవ్వుతోనే ముగించారు.

బయటి కొచ్చింతర్వాత సునీజకేసి చూచి "నన్ను మన్నించవూ" అన్నాడు ప్రభాకర్. నవ్వుతూ వెళ్ళిపోయింది సునీజ.

ఈరోజు ఉత్తరం అందిన తర్వాత భోజనం చేసేటప్పుడు అటు ఇటు తిరిగే జ్యోతిముఖంకేసి చూశాడు ప్రభాకర్. అమాయికమైన జ్యోతికళ్ళు కలువలై, ముఖం జ్యోతిర్మయంగా వెలుగుతున్నట్టుకనబడింది. వసారాలో ఎదురైన సుశీల చూపులు భయాందోళనలను స్పష్టంగా వ్యక్తపరుస్తూ ప్రభాకర్ ముఖాన్ని సూటిగా చూడలేకపోతున్నాయి.

మిల్లుకు తిరిగొస్తూ జ్యోతి కిచ్చిన వాగ్దానం గుర్తుకొచ్చి, పూర్వవృత్తాంతం జ్ఞాపకం వచ్చింది ప్రభాకర్ కు.

ఆరోజు చరచరా మేడమీదికి సుశీలకోసం వెళ్ళాడు ప్రభాకర్.

సుశీల అక్కడలేదు. జ్యోతి ఒంటరిగా కూర్చొని తన భగ్నజీవితంగూర్చి ఆక్రోశిస్తూ ఉంది.

అంత చిరుతవయస్సులో పసుపు కుంకుమతో నిత్యకల్యాణమై ఉండవలసిన జ్యోతి ముఖబింబం బీటలువారింది. ఆమె తన బాహ్యసుఖాలను వర్జించి ఎంతనిష్ఠగా జీవితాన్ని గడుపుతున్నా ప్రకృతిమాత్రం తన ధర్మాన్ని యథావిధిగా నిర్వర్తించుకుపోతూంది. ఆవిడలోని తిలకసౌందర్యం చనిపోయినా యౌవనసౌకుమార్యం చావలేదు. నిరాశా నిస్పృహాలతో ఆమె మానసిక జీవితం రూపుమాసినా ఆమె తెల్లటి దుస్తులోంచి యౌవనంతొంగిచూస్తోంది. సౌందర్య తరంగాలు నలుగడలాచిమ్మే ఆమెజీవితంలో అందరికీ మల్లే ఎన్నో ఆకాంక్షలూ, మధురమైన వాంఛలూ ఉంటాయి. భర్తృవిహీన అయినంతమాత్రాన అలాంటి కోర్కెలు అణగారిపోతాయా? 'నీ జీవితాన్ని జ్యోతి సుఖానికై అర్పించు. మనోబాధలతో అలమటించే ఈ అభాగ్యురాలి హృదయక్షేత్రంలో సుగంధ సంభరిత కుసుమాలు పుష్పింపజేయి. నీ కిదే ఆదేశం. నీ ఆదర్శం కూడ ఇదేనేమో!'

ఈ మనోసందేశాన్ని అందుకొన్న ప్రభాకర్ తన ఆదర్శానికి నిదర్శనంగా వెంటనే జ్యోతిని గాఢంగా కౌగలించుకొన్నాడు. ఇద్దరూ పరిష్వంగానుభూతిని పొందారు. జ్యోతినాన్నగారిని ఒప్పించి జ్యోతిని పెండ్లి చేసుకొంటానని జ్యోతిచేతిలో చేయివేసి ప్రమాణం చేశాడు ప్రభాకర్.

బి. కాం. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైన ప్రభాకర్‌ను ఉద్యోగి మేధావిగా చూచుకోమని వాళ్ళ నాన్నగారేమాత్రం కోరటం లేదు గాని, అతని శ్రేయోభిలాషులూ, సన్నిహితులు ప్రోద్బలం చేస్తున్నారు. మంచి ఆస్తిపరుడైన ప్రభాకర్ ఉద్యోగం తప్పనిసరిగా చేయాల్సిన అగత్యంలేదు. కాని, స్నేహితుల పోరుపడలేక ప్రభాకర్ బాగా ఆలోచించి ప్రభుత్వోద్యోగంలో చేరి ప్రజోపయోగకరమైన సాంఘిక సేవ చేసేందుకు సంసిద్ధుడయ్యాడు. ప్రభాకర్ ఇలా కృతనిశ్చయుడవటమూ, సర్వీసు కమీషన్ ప్రకటనలు పడటం, రెండు, మూడు ఉద్యోగాలకు ప్రభాకర్ దరఖాస్తులు పడవేయటం జరిగింది.

ప్రభాకర్ అదృష్టానన్ననుసరించి రెండు వేర్వేరు ఉద్యోగాలకు మౌఖికపరీక్షలు ఒకే రోజున నిర్ణయింపబడి, సర్వీసు కమీషన్ కార్యాలయానికి రమ్మని ఉత్తరవులొచ్చాయి.

సాంఘికసేవోద్యోగి స్థానానికి మొదట హాజరై కొన్నిగంటలతేడాతో, 'మార్కెటింగ్ ఇన్‌స్పెక్టర్' ఉద్యోగంకోసం ఆసభ్యులయెదుటే అభ్యర్థిగా హాజరయ్యాడు ప్రభాకర్. సాంఘిక సేవోద్యోగి స్థానానికి మౌఖికపరీక్షప్పుడు సర్వీసు కమీషన్ సభ్యులు తనఊరూ, పేరూ అడిగారేకాని మరేప్రశ్నా అడుగలేదు. 'మార్కెటింగ్ ఇన్‌స్పెక్టర్' ఉద్యోగంకోసం వెళ్ళినపుడు ఏవేవో లోకజ్ఞానంగూర్చి యక్షప్రశ్నలడిగారు. చాలావాటికి తప్పుప్రత్యుత్తరాలిచ్చినట్టు తనకు జ్ఞాపకం. అయితే, 'మార్కెటింగ్ ఇన్‌స్పెక్టర్'గా తనను ముత్యంపేటకు వేసినట్టు రాష్ట్ర మార్కెటింగ్ ఆఫీసరు కార్యాలయంనుంచి వచ్చిన ఉత్తరవును చూచి ఆశ్చర్యచకితుడయ్యాడు ప్రభాకర్. ప్రభుత్వోద్యోగాలు వ్యక్తుల తాలూకు అభిరుచుల ననుసరించి రావనీ, ఖాళీలను ఏదోవిధంగా భర్తీచేస్తున్నారని అభిప్రాయపడి ప్రభాకర్ 'మార్కెటింగ్ ఇన్‌స్పెక్టరు' ఉద్యోగం చేయటానికి సిద్ధపడ్డాడు.

ముత్యంపేటకు ప్రయాణమై వెళ్ళే ముందు రోజున ఊళ్ళోని వితంతు శరణాలయ సలహా సంఘంవారు సభ ఏర్పాటుచేసి ప్రభాకర్‌కు ఘనంగా వీడ్కోలిచ్చారు. సంఘాధ్యక్షుడైన ప్రభాకర్ స్థానంలో ఆరోజే మరో వ్యక్తి ఎన్నుకోబడ్డాడు.

పురప్రముఖుల సహాయం, సహకారం చూరగొని అనాథాలయం, వితంతుశరణాలయాల పురోభివృద్ధికి ప్రభాకర్ అహర్నిశలు పాటుపడి పనిచేసేవాడనీ, అతని మిత్రులను, సన్నిహితులను ప్రోత్సహించి శరణాలయంలోని వితంతువులు చాలామందికి పునర్వివాహాలు చేయించాడనీ, ఇలాంటి సంఘసేవకుడు సంస్థను వదలి దూరంగా వెళ్ళడం తమ దురదృష్టమని సభలో పలువులు పలు

ఖాల ప్రభాకర్‌ను ప్రశంసించారు. సభలో మాట్లాడినవారి ప్రశంసలకు బదులుగా ప్రభాకర్ తను ఆదర్శప్రాయంగా ఉండి వితంతువును వివాహమాడేందుకు సంసిద్ధుడనీ, తానెక్కడుండినా సంఘసంస్కరణల ప్రబోధనలను యథావిధిగా ప్రచారం చేస్తుంటానని

## ఆదర్శం

నొక్కి వక్కాణించాడు.

ముత్యంపేట మరీ పల్లెటూరు కాదు. అటు బస్తీ కాదు. అది ఫిర్కా కేంద్రం. నియోజక వర్గానికి కూడా కేంద్రం. అక్కడ వేరుసెనగ వ్యాపారం ఎక్కువ. నూనె మిల్లు లెక్కువ. వ్యాపారరీత్యా ఇంతటి ప్రాముఖ్యం గల ఈ గ్రామానికి ఇటీవలే విద్యుచ్ఛక్తి వచ్చింది.

(45 వ పేజీ చూడండి)

# హరివంశము

(గతివారం తరువాయి)

నీల మాట్లాడలేదు. ఆమెకు మాట్లాడడానికి ఏమీ తోచలేదు. వీరితో ఇట్లా ఇక్కడ మాట్లాడుతూ కూర్చుంటే ఇంటిలో నిదురలుపోతున్న వారు లేస్తారు. నీల ఒక ఆలోచన చేసింది. ఇంటి లోనికిపోయి బిందె పుచ్చుకు వచ్చినది. గోపికలకు దాని ఆలోచన అర్థమైనది. వారుగూడా ఇండ్లకుపోయి బిందెలతో యమునకు బయలుదేరినారు. ఆయమున వారి సంతోషాన్ని ఎరుగును. వారి దుఃఖాన్ని ఎరుగును. వారితాపాన్ని ఎరుగును. తాపోపశమనరీతులను ఎరుగును. వారికివలెనే యమునగూడా రసమూర్తి; రసాత్మకి; రసార్ద్రత్మకై గోపికలు నీలతో యమునదిక్కు నడుస్తున్నారు. అంతలో హఠాత్తుగా నీల ఆగింది. వారు ఆగారు. నీల తన బిందెను ఒక గోపికకు అందియిచ్చి తాను ఇంటిముఖమై నడిచింది. వారికి అది ఎందుకు అట్లా చేస్తున్నదో అర్థం కాలేదు. వారు దానిని ఎందుకని ప్రశ్నించలేదు. నీల తిరిగి ఇంటికి వచ్చింది. అభ్యంతర మందిరాన్ని దరిసింది. శ్రీకృష్ణుడు బలరామునితో, అక్రూరునితో, అక్కడ శయనించి వున్నాడు నీల శ్రీకృష్ణుణ్ణి సమీపించింది. చేతితో మెత్తగా తట్టింది. శ్రీకృష్ణుడు కళ్లు అల్లన తెరచినాడు. "స్వామి! గోపికలు తమకోసమై వేచివున్నారు!" మాటచెప్పి నీల అచ్చట నిల్వలేదు. బయలుదేరింది. అది గోపికలను చేరుకున్నంతలో శ్రీకృష్ణునిమూర్తి అల్లంతదూరములో గోపికల నయనపథంలో అవతరించింది. వారు అతనికోసం అక్కడ ఆగలేదు. నీల ఆగనీయలేదు. తన బిందెపట్టుకొని యమునకు దారి తీసింది.

యమున మధుర సంగీతనినదంగా, మురళీధ్వన్యనుకారివిచిత్ర రాగమేళిగా ప్రవహిస్తున్నది. గోపికల హృదయాలనుపోలి నిరంతర శృంగారరసావధిగా ప్రవహిస్తున్నది. నీల జీవితాన్ని పోలి నిరంతర దుఃఖగాథాసంబాధంగా ప్రవహిస్తున్నది. నీల దుఃఖం ఆ యమునకే తెలుసు! కృష్ణుడు ఆమెను స్వయంవరమై వచ్చినాడు. తిరిగి ఆమె వంక చూడలేదు. ఇప్పుడు మధురకు పోతున్నాడు. నీలను ఏమి చేసి పోతాడు! విషయం ఎవ్వరికీ పట్టలేదు. అంతలో కృష్ణుడు అక్కడికి వచ్చినాడు. గోపికలు అతనిని పుల్కుపుల్కున చూచినారు. అతడు మాట్లాడలేదు. మౌనియై నిలబడినాడు. అప్పుడు ఒక్క గోపిక అన్నది: "కులము, శీలము, మానము, అభిమానము, అన్నీ వదిలిపెట్టి నీతో తగులములు పెట్టుకున్నాము. ఇప్పుడు నీవు యముడవై మా ప్రాణాలనే వెంటబెట్టుకు పోతున్నావు నీవు ఇక్కడ నుండిపోగా ఆ వలరాజు మాపై తనధనుష్పాండిత్యం అంతా చూపించకుండా వూరుకుంటాడా? వాడు వామ్రపతాపోగ్రుడు! కృష్ణా! ఇట్లా మమ్మల్ని రెండు మూడమ్ముల వేటకాని తూపులకు అగ్గం చేసిపోతావా? ఇది నీకు న్యాయమా! ధర్మమా? మాట్లాడవేమయ్యా! మౌనీ! మేము బాధపడటం నీకు సంతోషమా?"

కృష్ణుడు మాట్లాడలేదు. మౌనియై నుంచున్నాడు. ఇంకో గోపిక అన్నది: "అవునయ్యా! నీకు మేము ఎందుకు నచ్చుతాము. మేము గ్రామ్యస్త్రీలము. నగరంలో స్త్రీలు అందంగా వుంటారు. అవ్యక్త మధురంగా మాట్లాడుతారు. వారు నచ్చుతారుగాని, నీకు మేము నచ్చుతామా! అందులో నీవు రాజబంధుడవు ఆయెను!"

శ్రీకృష్ణుడు మాట్లాడలేదు; మౌనియై నుంచున్నాడు. మరి ఒక గోపికఅన్నది: "సఖులారా! ఇతణ్ణి నిందించి ఏమిలాభం. ఇతణ్ణి, సమస్త గోష్ఠములకు సారభూతమైనవాణ్ణి, విధి, ఇక్కడినుంచి ఇంకోచోటికి పంపించివేస్తున్నాడు. ఆ విధిని అనాలి. వాడు పరమ నిర్ఘృణుడు. గోపయోషితల ఆనందాన్ని దురాత్ముడై హరించివేస్తున్నాడు."

శ్రీకృష్ణుడు మాట్లాడలేదు. మౌనియై నుంచున్నాడు. ఇంకో గోపిక అన్నది: "అదే నిజమంటావా! లేకపోతే, రేపు పట్టణంలో మేడలమీద వుండి సువర్ణలాజములు చల్లే ఫుల్లసరోజలోచనలను, పూర్ణసుధాంశుముఖులను, పురాంగనలను, మనస్సులో పెట్టుకొని, పల్లెల్లో వసించే ముద్దరాండ్రను, మమ్మల్ని, మరచిపోదామనుకుంటున్నావా! కృష్ణా! ఇక్కడగూడా బంధువులు వున్నారు. అయితే వీళ్లు పాతబంధువులు. ఇప్పుడు క్రొత్తబంధువులను చూడ్డానికి పోతున్నావు. సరే! మేము జ్ఞాపకంవుంటామా! మా గ్రామసీమలు జ్ఞాపకం వుంటాయా! స్వామీ! మమ్మల్ని ఏమి చేయదలచుకున్నావు?"

కృష్ణుడు మాట్లాడలేదు. మౌనియై నుంచున్నాడు. ఇంకోగోపిక అన్నది: "ఇక మాకు శారదరాత్రులు లేవు. రాసలీలలులేవు. అనురాగలలితస్మితము. వల్గుమంత్రములు, లీలావలోకనములు, పరిరంభణములు రాసగోష్ఠులులేవు. మా జీవితాలు ఎట్లా గడుస్తాయి? కృష్ణా! నీవులేని మా జీవితం ఏమైపోతుంది. నీలే! నీవు చెప్పు. సాయంత్రంకాగా, ఖురరజస్ఫురితాలకమైన ఇతనిముఖం కన్పించకపోతే ఎంత తపించిపోయేవాళ్ళమో చెప్పు? మధురమైన వేణునినాదం విన్పించకపోతే ఎంత దుఃఖించేవాళ్ళమో చెప్పు? ఈ కృష్ణుణ్ణి చూడని క్షణాలు మాకు ఎట్లా యుగాలుగా వుండేవో చెప్పు? ఇప్పుడు ఇతడు మధురకుపోయి తిరిగిరాకపోతే మేము ఏమైపోతాము. మా జీవితాలు ఏమైపోతాయి?"

కృష్ణుడు మాట్లాడలేదు. మౌనియై నుంచున్నాడు. మరి ఒక గోపిక అన్నది: "అక్రూరుడట! అక్రూరుడు. వీడొక క్రూరాత్ముడు అక్రూరుడన్న పేరుపెట్టుకొని అద్భుతప్రక్రాంతిగా చక్కా వచ్చాడు. శ్రీకృష్ణుణ్ణి తీసుకుపోతాడట. ఏదీ తీసుకుపొమ్మను! నేను ఈ కృష్ణుని పాదములకు అడ్డంపడతాను. రథానికి అడ్డం తగులుతాను. కదలనీయను. ఎట్లా తీసుకుపోతాడో చూస్తాను. నిజంగా ఈ వచ్చినవాడు అక్రూరుడే అయితే శ్రీకృష్ణుణ్ణి ఇక్కడ వదిలిపెట్టి తాను వెళ్లిపోతాడు."

గోపికలలో కందర్పజ్వరం అధికం అవుతోంది. వారు భ్రాంతలై కృష్ణుణ్ణి నానావిధములుగా ఉపాలంభిస్తున్నారు. వేల్పులను ఉపాలంభిస్తున్నారు. తమ్ము ఉపాలంభించుకుంటున్నారు ఒక్కసారి వారు నీలతో అంటారు: "నీలే! కృష్ణుణ్ణి కొనిపోవద్దని మనం ఆ అక్రూరుణ్ణి ప్రార్థిద్దామా? కృష్ణుణ్ణి పోనీయకండి. ఇక్కడే

హరిత శివశర్మ

# హరివంశం

నిల్పండి—అని దేవతలను ప్రార్థిద్దామా? కృష్ణా! నువ్వు పోవద్దు. అని ఈయన పాదాలు పట్టుకొని కదలనీయకుండా ఆపివేద్దామా? నీలే! దైవమా! ఏమిచేయమంటావు? నీలే! మాట్లాడవేమి!". నీల వారిదుఃఖాన్ని చూచి, తన దుఃఖాన్ని చూచికొనికన్నా ఎక్కువగా దుఃఖించింది. అంతకన్నా ఏమిచేస్తుంది? ఈ కృష్ణుడేమైనా తన చేతులలోనివాడా! వీరు ఇట్లా పరితపిస్తుంటే మౌనం వహించి ఊరుకుంటాడేగాని మాట్లాడడేమి? వారి అనుతాపం తనకు పట్టదా? గోపికలు అశ్రునేత్రలు, విరహదుఃఖకర్శితలు అయి తపించిపోతున్నారు. వారిని ఈయన చూడనికారణం ఏమి? ఆగోపికలు ఇప్పుడు సిగ్గులువూని, కన్నుల నీరునిండగా, వివశత్వంతో "గోవింద! మమ్మల్ని రక్షించు!" అంటున్నారు. కేసులు, చీరలు మరచిపోతున్నారు. పవనోద్ధూతలతాభలై విప్రయోగబాధపడవలసివస్తుందేమో అని అల్లాడిపోతున్నారు. కపోలతటసవిన్యస్తహస్తాబ్జలై "మాధవ! గోవింద! దామోదర! మమ్మల్ని ఏమిచేసిపోతావు" అని ఆక్రోశిస్తున్నారు. కృష్ణుడు మౌనం వదలడు.

అప్పుడు నీల అన్నది: "స్వామి! నన్ను సరే. పట్టపువిని వదిలి పోతున్నారు. తాళికట్టినా, కట్టకపోయినా నేను భార్యను. నన్ను స్వయంవరంలో వివాహమైనారు. వీరు నావలె కాదు. తమర్ని నమ్ముకొని సర్వసంసారబంధాలు త్రెంచుకున్నారు. వారిని ఏమి చేస్తారు?"

"నీలే! నేను ఎవరిని ఒకరిని ఏమన్నా చేయడానికి! ఎవరు ఏమిచేసుకున్నా వారికివారే చేసుకుంటున్నారు. నేను నిన్ను ఏమి చేసినాను? ఈ గోపికలను ఏమిచేసినాను? మిమ్మల్ని వదలిపోతున్నానని భయం దేనికి? నేను మధురకు పోకతప్పదుకదా! వెళ్ళి కబురు పంపిస్తాను. అసలు నేను మిమ్మల్ని వదలడం అంటూ ఎక్కడ! నేను ఎప్పుడూ మీకు సమీపంలోనే వుంటాను. మీలోనే వుంటాను. మీతోనే వుంటాను. ఇది మీరు తెలుసుకోవాలి."

"తెలుసుకుంటున్నాము స్వామి! తెలుసుకుంటున్నాము. కాని మీరు ఏదైనా తెలియనిసేనా? నేను ఎంతటి వియోగాన్నైనా భరిస్తాను. ఈ గోపికలు భరించగల్గుతారా! మీరు తిరిగివస్తారని తెన్నులుచూస్తూ ఎంతకాలం అయినా నేను కూర్చుంటాను. ఈ గోపికలు కూర్చోగలరా! స్వామి! నేను గోవర్ధనం ఎత్తిన స్వామిని, వృషరక్షస్సును మారించిన స్వామిని, సప్తవృషభహంతను, మనస్సులో పెట్టుకొని ఆరాధించుకోగల్గుతాను! ఈ గోపికలుగూడా నీ బాలమూర్తిని ఆరాధించుకుంటూ వుంటారు. అంతటితో మీయందు వారికిగల విరహం వదులుతుందా? స్వామి!, మమ్మల్ని ఏమి చేయ మంటావు? మమ్మల్ని ఏమి చేసి పోతున్నావు! మేము ఏమైపోతాము? ప్రభూ! ఈ గోపికలను జారిణులను చేశావు! నన్ను ఏమిచేశావు! స్వామి! నేను ఎవర్తుకను! నన్ను పెండ్లి ఆడినావా? లేదు. స్వయంవరం అయి తెచ్చినావు. పెండ్లి ఆడటం అంటూ వుంటుందా! అది తమరు చెప్పాలి. నేను ఏమిటి? నేను ఏమైపోతాను. స్వామి! నేను ఏమైపోతాను? మళ్లీ నాకు తమ దర్శనభాగ్యం లభిస్తుందా! లేక ఇట్లాగే వేచి, వేచి హృదయం వత్తులు చేసుకోవలసిందేనా? దగ్గరవుండే మీరు మాకు దూరం అయినట్లు మెసలుతున్నారు. ఇక దూరం అయితే దగ్గరలో వున్నట్లు వుంటుందా! దగ్గరలో వున్నప్పుడు కళ్లతో చూచుకొని సంతోషిస్తున్నాము. దూరంలో వున్నప్పుడు స్వామి! మనస్సులో చూచుకొని సంతోషం పెంచుకోవడం

మాకు విధిస్తున్నారా! మమ్మల్ని ఏమిచేస్తున్నారు! ఏమిచేస్తున్నారు! ఏమి చేస్తున్నారు!!

అంతలో శ్రీకృష్ణదేవుడు మురళిని మ్రోయించినాడు. ధ్వనులు విచిత్రములై వారి మనస్సులకు తాకాయి. వారి సర్వ శరీరంలోనూ విచిత్రమైన అనుభవాన్ని రెకెత్తించాయి. వారికి అప్పుడు రాసక్రీడ సలుపుతున్నట్లు వుంది. అంగనకు అంగనకు మధ్య కృష్ణుడు; కృష్ణునికి కృష్ణునికిమధ్యను అంగన; అంగనా కృష్ణులు కట్టిన మండలంమధ్యను దేవకీనందనుడైన కృష్ణుడు; కృష్ణునిపజ్జ నీల; అంతా స్వప్నంలోవలె వారికి మేల్కొనివుండగా అనుభూతం అవుతున్నది. యమునమీదుగా వీచే చల్లని గాలులమీదగా తేలి ఆనాదం బృందావనం అంతటా వ్యాపించింది. బృందావనంలో రాసలీలలుగా మసలింది. నందునియింటిలో అక్రూరుడు ఆనాదం చెవులకు సోకగా హఠాత్తుగా మేలుకున్నాడు. నాదం ఏమూ? అని ఆశ్చర్యపోయినాడు. ఆనాదం యమునవైపున నుండి వస్తున్నది. ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. ఏ గోపకుడు ఈ మధుర వ్యాహారంలో ప్రకృతిని నాట్యం ఆడిస్తున్నాడు? అక్రూరుడు ఆ నాదాన్ని బట్టి యమునకు బయలుదేరినాడు. అతనికి ఆ ఘోషాన్ని చూడగా విచిత్రంగా వున్నది. ఆ ఘోషం సుషుప్తిలోవున్న మౌనమైన ఆనందాన్ని భజిస్తున్నది. ఆ ఆనందమే తనలో జాగరితమై ప్రతిఫలిస్తున్నదనుకున్నాడు అక్రూరుడు. అనుకుంటూ వేణు నాదాన్ని బట్టి ముంగుకు సాగినాడు. ముందు యమున; చంద్రుని కిరణాలు ప్రతిఫలిస్తున్నది. నల్లని ఆకాశంలో చంద్రుని వెన్నెలలను అంచులలో పోసికొని మెరుస్తున్న మేఘమాలికలనుపోలి ప్రవహిస్తున్నది. యమునఒడ్డున ఇసుకలు; వెన్నెలకన్నా తెల్లగా పరుపుగల్గి విస్తరించి వున్నాయి. వెన్నెలలో గోపికలు; గోపికలనడుమ కృష్ణుడు; కృష్ణునిప్రక్క ఆయమఎవరు? అవును. ఆమెను తాను నందుని ఇంటిలో చూచినాడు. ఈమె కుంభుని నందన అయివుంటుంది. నీలాసుందరి అయివుంటుంది. స్వామిమనస్సునుపోలి, స్వామి వేణువు యొక్క గానాన్నిపోలి ఆమె కన్పిస్తున్నది. వాసుదేవుడు వీరిని ఇక్కడ వదిలి వచ్చివేస్తున్నాడా? అనుకున్నాడు అక్రూరుడు. నన్ను కంసుడు ఇక్కడకు ఎందుకు పంపినాడు? అనుకున్నంతలో అతనికన్నులు మిరుమిట్లుగొన్నాయి. అతనిమనస్సు దిగ్భ్రాంతిని చెందింది. శ్రీకృష్ణుని వేణువు అద్భుత కలనాదాన్ని ఊదిపోసింది. అహో! అది ఏమిదృశ్యము. అంగనకు అంగనకుమధ్య మాధవుడు; మాధవునకు మాధవునకుమధ్య అంగన; అంగనామాధవులు కట్టిన మండలము; మండలము మధ్యను దేవకీనందనుడు; దేవకీనందనుని పజ్జను, ఆయన వేణువునుపోని నీల; ఆ దృశ్యాన్ని చూచి అక్రూరుడు గొతులుఎత్తి నమస్కరించి, "హే భగవన్! ధన్యుణ్ణి; ధన్యుణ్ణి; ఇదా రహస్యము; ఇదారహస్యము; హే భగవన్! హే భగవన్! అర్థమయింది. అర్థమయింది." అనుకున్నాడు.



చిత్రకారుడు—జె. సత్యనారాయణ (విశాఖపట్టణం)

యమున తరంగాలు లేచి నాట్యంచేసింది. యమున ఒడ్డున వున్న నీలికొనుగులు గాలులుకదిలి సుషిరములు మ్రోగాయి. ప్రత్యంతధాత్రి శ్రీ కృష్ణపాద పద్మరజోస్పర్శలో సువాసన గుబాళించింది. సూర్యునికాంతిని పోసుకొని శీతరశ్మియైన చంద్రుడు వినూత్న కాంతియై ప్రకాశించాడు. నక్షత్రాలు ఆ చంద్రునితో కలిసి ఆకాశంలో రాసక్రీడ సలుపుతున్నట్లు మచ్చరించాయి. ఆకాశం శ్రీకృష్ణ సుషిగోద్గారి వేణునాదాన్ని పోసికొని శబ్ద బ్రహ్మం ఘనీభవించినట్లు 'ఓం' కారాన్ని మెరసింది.

అప్పుడు అతనికి అనంతమైన ఆకాశంలోనుండి గోపికల ఆర్తినిపోలి ఈ మాటలు విన్పించాయి.

"అక్రూరః క్రూరహృదయః
శీఘ్రం ప్రేరయతే హయాన్
ఏవమార్తాసు యోషిత్సు
కృపాకస్య న జాయతే."







# అతిథి దేవుళ్లు

సిహెచ్. శంకరశాస్త్రి

ఇంతవరకు జరిగిన కథ: పోకిరీభాషలో లేదా ఈనాటి గెస్టుల మాటల్లో చెప్పుకోవాలంటే సుబ్బయ్యశాస్త్రిగారింట చుట్టాలు దిగి ఇల్లంతా నానాఖంగాళీ చేశారు. ఆయనకి ఒళ్లుమండిపోతోంది-అని టూకీగా చెబితే చాలు. కాని అతిథిని భగవత్స్వరూపుడుగా, తనకు సేవచేసే మహాదవకాశం ప్రసాదించ వచ్చిన మహనీయుడుగా ఎంచి మన్నించే భారతభూమిలో (క్రిందటితరం) పుట్టి పెరిగినవారు కావున, శాస్త్రిగారినిబట్టి పైవిధంగా మడిగట్టుకు మాట్లాడుకోవలసి వచ్చింది.

తాత్కాలికంగా మనసుకు ఆయాసం కలిగినా, తమాయించుకుని మర్యాదలకు లోపంలేకుండా అతిథి అభ్యాగతులను ఆదరించే దేశం మనది. వీరు దేవుడులా చూసినట్టే, తామూ దైవాలన్న సంగతి మరవకుండా ఆహోదాలోనే వ్యవహరించే అతిథుల దేశం కూడా ఇదే. నిజానికి దేవతలే అతిథుల వేషాలు వేసుకువచ్చి భూమిమీద తిరిగిన దేశం ఇది. సాక్షాత్తూ బ్రహ్మ విష్ణు మహేశ్వరులే అనసూయ ఇంట ఆతిథ్యం స్వీకరించారు. నోటబెట్టుకోబోయిన ఒక్కగానొక్క కబళందక్కకపోగా, గుక్కెడు తీర్థం పుచ్చుకోబోతున్న రంతిదేవుడి గుమ్మానికి దేవేంద్రుడే అభ్యాగతిగా వచ్చాడు. ఎంగిలికూడైనా సరేనని సిద్ధపడి రాముడు శబరి వాకిటకు వచ్చాడు. ఉన్నదంతా పెట్టే త్యాగులేగాక, ఎవరో ఒక అతిథి అయినా లేకపోతే ఉన్నది కూడా తినకుండా అభోజనం పడుకునే నైష్ఠికులు, వరద గోదావరికి ఆవలిగట్టున అభాగ్యుడి ఆక్రందనం విని అతణ్ణి నిశిరాత్రివేళ ఇంటికి తీసుకువచ్చి అన్నంపెట్టిన డొక్కాసీతమ్మవంటి మతల్లులు ఇక్కడే ఉన్నారు; 'ఆ ద్వాదశిఘడియలు తీరేలోగా వస్తే నా అదృష్టం; లేకపోతే నీ ఖర్మం' అన్న అంబరీషులూ, వేళకు వెళ్లకపోతే ఏమవుతుందో చూదామని, చూసి

గోదావరీ పుణ్యోదకాలలో స్నానమాడి, సంధ్యవార్చి శివాలయానికి వెళ్లి భగవద్దర్శనం చేసుకొని నెమ్మదిగా ఇంటికి బయలేరారు సుబ్బయ్యశాస్త్రిగారు. వీధి మొగకు వచ్చేసరికే అల్లంతదూరాన తమ లోగిలి వెనక పెరట్లో గడ్డివాములు రెండూ అ సగిరులవలె అరుణకాంతులతో మెరుస్తూ కనిపించాయి. బంగారువన్నెగల ఆ మేటి మీదకి బంతిపూరంగు కాంతులు ఎగబాకుతూ అంతలోనే జారిపోతూ పైకిలేస్తూ ఆడుకొంటున్నాయి. ఈవేళపుడు నీళ్లు కాగపెలిగించారేల చెప్మా, చుట్టాలు దిగలేదు కదఅనుకొన్నారు శాస్త్రిగారు. పాలేళ్లు తన పక్కనించే నీళ్ల కావిళ్లు మోసుకుపోతున్నారు. ఇంటిముంగిట గడ్డిపరకలు చెల్లాచెదరుగా ఉన్నాయి. కొంచెం అవతలగా తురాయిచెట్టుకింద బళ్లు వాల్చి ఉన్నాయి. గుమ్మంపక్కనే చీడీలమీద చిన్నకుమారుడు రామం ఒక్కడూ కూర్చున్నాడు- దిక్కుమొహం పెట్టి. వీడిలా కూర్చున్నాడేల- అతిథులెవరో దిగిఉండాలి అనుకొంటూ ముందుకు సాగారు శాస్త్రిగారు; మూగమైనందువల్ల వాడిని పలకరించి వైనమడగలేక. లోపల గడపదగ్గర తాను కాళ్లుకడుక్కునేందుకు నీళ్లు సిద్ధంగా లేకపోయేసరికి ఊహ బలపడింది. గడపకవతల ఐదారుగురు పిల్లలు, ఇంటికప్పెగిరిపోతుందని కాబోలు మండువాలో కేకలు వేస్తూ అల్లరిచేస్తున్నారు. రామం తాలూకు మాజికాయబండి, వాళ్లచేత పడి హృదయవిదారకంగా ఆర్తనాదాలు చేస్తోంది. ఆ కక్ష్యగడిచి నడిచి మండువాకు వెళ్లేవరకు, అక్కడ వసారాలో తనకు అత్యంత ప్రీతిపాత్రమైన తూగుటూయలమీద అన్యులెవరో విలాసంగా విశ్రమించి ఊగుతున్నారు. అవతల తన గదిలో, తానే గౌరవపీఠంగా ఎన్నిక చేసుకొని సవినయంగా కూర్చొనే తన తండ్రిగారి వాలుకుర్చీలో మరెవరో కాళ్లు బారజాచుకుని కూర్చున్నారు. తన పుస్తకాలు చెల్లాచెదరుగా ఉన్నాయి. వంటయింటివేపునుంచి గట్టిగా మాటలు నవ్వులు వినిపిస్తున్నాయి. కుర్చీలో పెద్దమనిషి తనను చూచి లేచి పలకరించబోయేవరకు, శాస్త్రిగారాయనను గుర్తించారు. అతిథిదేవోభవ అనుకుని, కూర్చోమని సైగచేసి పూజాగృహంవైపు సాగిపోయారు, దీపదర్శనం కోసం.

నాలిక్కరచుకున్న దుర్వాసులూ ఇక్కడే ఉన్నారు. సపరివారంగా విందారగించి 'ఆ కామధేనువు నీకెందు'కని లాక్కున్న కార్తవీర్యుడూ, సుబ్బరంగా తిని వెల్లకిలా పడుకుని తిన్నింటి వాసాలు లెక్కపెట్టి 'ఈ ఇల్లు నాద'న్న దానయ్య (దారిన పోయే) లూ ఉన్నారు.

రోజులు మారాయి; సంప్రదాయాలపట మోజులూ మారుతున్నాయి. గేస్టూ అతిథీ కూడా తెలుగుమీరిపోతున్నారు. ఎటొచ్చీ ఇద్దరూ చెరో వేపూ పోతున్నారు. గేస్టుకు మర్యాదలు చేయాలన్న పట్టింపు తగ్గిపోతూ వుంటే, అతిథికి పెరుగుతోంది; అంటె. చుట్టం బండిదిగ్గానే, "మళ్లీ రైల్లో రిజర్వేషన్ దొరకడం, కష్టం. ప్రయాణం ఎప్పుడో చెబితే సీటు రిజర్వుచేయిస్తాను కుర్రాణ్ణి పంపి" అంటాడు గృహస్థు. 'దానికేం లెస్టూ, రిజర్వేషన్ లేపోతే మామూలుగా వెళ్తాం. లేదా దొరికేదాకా ఉంటాం. స్థిమితంగా నాలుగురోజులు ఉందామనే వచ్చాంలే' అంటాడు అతిథి. అయితే వీరిలో అతిథి మేలుకోరి రిజర్వేషన్ గురించి తొందరపడే గృహస్థులు, గృహస్థు మేలుకోరి తొందర పడే అతిథులూ లేకపోలేదు. పెంకెవాళ్ళూ లేకపోలేదు.

ఒకసారొకాయన తనయింట శుభకార్యానికి ఆహ్వానపత్రికలు పంపాడు. మరొహాయన అందులో ఉన్నప్రకారం అక్షరాలా వెళ్లి అవమానించాలని పెంకెతనం చేయాలన్న దురాశతో పోతన్నగారింటికి వెళ్ళిన శ్రీనాథుడికిమల్లే బంధుకోటితోను మిత్రశతంతోనూ శిష్యవర్గంతోనూ మాత్రమే గాక, కిరాయికి పరివారాన్ని కూడా పుష్కలంగా కుదుర్చుకుని బంధుమిత్ర సపరివారంగా గుమ్మంలోకివచ్చాడు దండెత్తిన రాజులా. పోనీ పెడదామన్నా పోతన్నగారిలా సరస్వతీదేవి వచ్చి మడి గట్టుకునే సదుపాయం లేదు; పెరట్లో జమదగ్నికిలా కామధేనువున్నూ లేదు; ద్రౌపది వంటింటవున్న అక్షయపాత్రా లేదు; గాన ఆయన గుమ్మంలో నిలబడ్డ జనాభా తన శుభపత్రికలో వాక్యంప్రకారం వచ్చిందికాబట్టి వాక్యంప్రకారమే ఆ పెద్దకూ ఆయన బంధుమిత్ర సపరివారానికీ చందన తాంబూలాలు మాత్రమే ఇచ్చి సాగనంపేశాడు—'ఇహదయచెయ్యండి, నేను ఆనందించడం అయిం'దంటూ.

* * *

తిథి వార నక్షత్రాలు చూసుగోకుండా వచ్చి దిగిపోయేవాడిని అతిథి అంటారు. అంటే గేస్తుయింట తిథి (ఆబ్దికం వంటిది) ఉన్నపుడు, ఆముక్క ముందుగా చెప్పి ఆపూటకి పౌరోహిత్యం, భోజనం చేసి చక్కాపోయేవాడు 'తిథి' అవుతాడు—అలాటిమాట అనడానికి ఆస్కారం లేకపోయినా. అతిథిదేవుడికి ఈ బెడద లేదు. ఇల్లు బయల్దేరేటపుడు తిథివారాలు చూసుకుంటాడు; మళ్ళీ గేస్తు ఇంట దిగింతరవాత–రాచకార్యాలరద్దీ ఆట్టే లేనివాడాయెనా–అన్నివిధాలా అనుకూలమైన తిథి, తనకి తిక్క కుదిరేదాకా కదలడు.

ఇలాటివాళ్ళు సంభవిస్తారని ఏనాడో పసిగట్టిన మనువు దూరదృష్టితో విలువయిన ముక్క రాసాడు. 'ఏకరాత్రంతు నివసన్ అతిథిర్ బ్రాహ్మణ స్మృతః.' ఒక్కరాత్రికి మటుకు ఉండి మర్నాడు కోడికూతతో లేచి వెళ్ళిపోయే సద్బ్రాహ్మడిని అతిథిఅంటారు అని. అనగా పైజెప్పిన ఫలానిసుగుణం కలవాడిని ఏమని పిలుచుకుని ఆనందించాలో మనకి తెలియజెప్పడంకోసం సదరు గుణవంతుడికి అతిథి అని నామకరణం చేయడం మనువుగారి తాత్పర్యం అయివుండదు. అతిథిగా వచ్చినవాడు ఎటువంటివాడు? వాడికి గేస్తు ఇంట ఉండే హక్కుభుక్తం ఏపాటీ అనేది ఖరారుగా మనందరి తరఫునా నిర్మొహమాటంగా చెప్పి శాసనం వేశారని అందరం ముఖ్యంగా అతిథులు గ్రహించుకోవాలి. హక్కుమాత్రం ఉంది. తిథివారాలు చూసుకోకుండా దిగి, ఆపూట భుక్తికి హక్కుకలవాడని నిఘంటువులు కూడా ఘంటాపథంగా చెబుతున్నాయి. ఎటొచ్చి హక్కుని శాశ్వతం చేసుకుని ఆయింటనే హెడ్డాఫీసు పెట్టుకోవద్దన్నది పాయింటు. అనిత్యం హి స్థితో యస్మాత్, తస్మాదతిథి రుచ్యతే. ఒక్కచోట నిలకడగా తిష్ఠవేసుకోకుండా, ధ్రువతారలా శాశ్వతుడైపోకుండా చాతుర్మాస్యాలు వగైరాలు ఏర్పచుకోకుండా తుమ్మెదలా త్వరగావెళ్లిపోయేవాడే అతిథి అని తాత్పర్యం. అభ్యాగతుడికి హక్కులేవీ లేవు. తినబోతూవున్న వేళకి వస్తాడుకాబట్టి, గేస్తుతో కలసి కలో గంజో కాస్త తాగిపోవడమే అతడి విధాయకం.

* * *

దేవుడిలాగే అతిథిదేవుడికీ బహురూపాలూ, అనేక నామాలూ ఉన్నాయి. అతిథులలో చుట్టాలూ స్నేహితులు, శత్రువులూ, మిత్రముఖ శత్రువులు, శత్రుముఖమిత్రులు, శత్రుముఖ శత్రువులూ, ఉపకారులు, ప్రత్యుపకారులు, అపకారులు, ఋణదాతలూ, ఋణార్థులు, ఋణగ్రస్తులు, వ్యాధిగ్రస్తులు, దేవతలు, రాక్షసులూ, వరాలూ, శాపాలూ, సోషలిస్టులు, కమ్యూనిస్టులు, కాంగ్రెసువాళ్ళు, స్వతంత్రావాళ్ళూ, కోర్టుజీవులు, పెట్టేవాళ్ళు, తినేవాళ్లు, ఆర్చేవారు, తీర్చేవారూ, ముక్కుబళ్ళవాళ్ళూ, వెనకబడ్డవారూ, దయాళువులు, నిర్దయులు, కోపిష్టివాళ్ళు, పరమ శాంతులు, నియంతలు, కుటుంబీకులు, తైర్థికులూ, ఆవులించమని బతిమాలి పేగులెక్కెట్టేవారూ, తిట్టుపోతలదాకా ఆడేవారూ, కలహాభోజనులూ, కలహాభాజనులూ, దంపుడుబియ్యంతప్ప ముట్టనివారు, ఓవల్టిన్ అలవాటైనవారూ.

పుష్కలంగా డబ్బు, బంధుమిత్ర ప్రేమ సహనం, ఔదార్యం, చాకచక్యం అనే పంచశీలాలూగాని, వాటిలో ఏ ఒక్కటి గాని ఉన్నచోట అతిథికి ఇన్ని లక్షణాలు ఉండవు. ముఖ్యంగా దుర్లక్షణాలు అభావమైపోతాయి. ఒకవేళ ఉన్నా గేస్తుకి కనబడవు.

తాలూకాఫీసు, జిల్లాబోర్డు, కోర్టులు, పి డబ్ల్యు. డి. ఆఫీసులు, సీట్లుదొరకని కాలేజీలూ, పేరుగలయోగులూ, శక్తిగల దేవుళ్లూ అప్పిచ్చువాడూ ఉన్న ఊళ్లు, పుణ్యక్షేత్రాలూ, ఆ దారిలో ఉన్న మజిలీ గ్రామాలూ, రైల్వే జంక్షన్లూ, విజయవాడ చెన్నపట్నం ఇవి అతిథి ఉచ్ఛలో ఉండే స్థలాలు. విశాలమైన లోగిళ్లు, చెడిబతికేవాళ్ళ ఇళ్లు, గృహస్థు సాధువైన గృహాలూ, పరోపకారుల ఇళ్లు ఇవి సాధారణంగా అతిథులను ఆకర్షించే కేంద్రాలు.

* * *

శ్రీమంతుల ఇంటికి చుట్టాలలంకారం అన్నా డొకచుట్టం. ఎప్పుడూ ఎవరో ఒకరు ఉంటే అది గొప్పఅనిన్నీ, మున్ముందు వారు






# అతిథి దేవులు

ఆస్తి పాడు చేసుకున్నప్పటికీ, అంతా చుట్టాలకే దోచిపెట్టేశాడని చెప్పకోడానికి (రేసులూ సినిమాలూ పేకాటా అంటే బాగుండదు గాబట్టి) బాగుంటుందనీ ఆయన అన్నారు. కొందరు కలవారిళ్ళ చుట్టాలెవరో, ఇంటివాళ్ళెవరో కూడా తెలీదు. అవి పెద్ద దివాణాలు, గెస్టుహావుసులుంటాయి కాబట్టి అంతా తెరిపిగా సహజీవనం చేయవచ్చు. వత్తిడి ఉండదు. కాబట్టి మొహాలు మొత్తవు. అసలు మొహాలే అస్తమానం కనబడవు కాబట్టే ఎవరెవ్వాళ్ళున్నారో తెలీదు. గుర్తూ ఉండదు. పది ఊళ్ళలో సొంత బంగళాలూ, మరో పదింటిలో బంధుమిత్రుల బాపతువీ ఉన్న ఓ జమీందారుగారు ఎప్పుడూ ఊళ్ళవెంట తిరుగుతూండడంచేత ఓమారు, సొంతబంగళాలోనే ఉంటున్నా ఒకనాడు తన అతిథికి సుస్తీ చేసిందని విని, "మనం మనింటికి పోతే మంచిదని" మొహమాటంచొప్పున బయల్దేరి బంధువుల బంగళాలో బసచేశాడట. భ్రమరకీటన్యాయం బొత్తిగా అసంభవం అని కొట్టిపారేసిందికి వీల్లేదు.

జమీందారు కాకపోయినా, ఆఫాయాలో వెలుగుతూ బస్తీలో దివాణమంత ఇల్లూవాకిలీ పెట్టుకున్న ఓ పెద్దకుటుంబరావుగారికి అతిథులు రకరకాలవాళ్ళుండేవారు. ఎవరెందుకొచ్చారో, ఉన్నారో, తిన్నారో అడిగేవారు లేనందువల్ల ఎవరెవరో ఎందుకెందుకో వస్తూ ఉండిపోతూ ఉండేవారు. ఆయనదే పెద్దసంసారం–కొడుకులూ, మనమలూ, మునిమనమలూ, మేనల్లుళ్లు, మేనకోడళ్లూ, వాళ్ళ పిల్లలూ, పిన్నిగారిపిల్లలూ కిలకిల్లాడుతూ ఉండేవారు. వాళ్ళలో కలిసిపోయి ఇంకెందరో బంధుమిత్రులుండేవారు. కాస్తపొదుపు చేదామనుకున్న ఇరుగుపొరుగులవారి తాలూకు కూడా అక్కడే కాలక్షేపం చేసేవారు. ఇంటిపెద్దకి ఓమారు కొంచెం ఖర్చు తగ్గాలన్న ఊహకలిగింది. అప్రకారం, ఆయన ఓమారు ఇంట్లో జనాభాలో ఓ నలుగురైదుగుర్ని మచ్చుకి కేకేసి, వాళ్ళెవరైందీ, ఎందుకొచ్చిందీ, ఏంచేస్తున్నదీ అడిగి, మరేమీ అనుకోవద్దనీ, చాలారోజుల్నించి కనబడుతున్నందువల్ల వచ్చి పనికాక ఇబ్బంది పడుతున్నారేమోనన్న అభిప్రాయంతో అడుగుతున్నాననీ అన్నారు.

"అదేవిటినాన్నా ! నన్నూ వదినెనీ, పిన్నికొడుకుల్నీ ఆమాత్రం ఎరగవా" అన్నాడు "అతిథి." చిన్నబుచ్చుకొని ఇంటాయన మళ్లీ ఎప్పుడూ ఎవర్నీ అడగలేదు. ఈ సంగతి తెలిశాకనే, అప్పారావు ఆ యింట్లో ప్రవేశించి అందరిదగ్గరా అప్పులు నొల్లుకోవడమే గాక, వీరంతా రావుగారిసొమ్మిలా దోచుకోవడం బాగులేదన్న భావంతో సాహసించి రెండుగదులు ఖాళీచేయించి తన అధీనంలోకి తెచ్చుకున్నాడు. ఆ పైన అందులో చిన్నఎత్తునే బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ వ్యాపారం పెట్టి, ఆ దిగినవాళ్లకి సకల సదుపాయాలూ దగ్గరుండి చేయిస్తూవచ్చాడు. ఈ విధంగా ఆర్జించిన ఆస్తితో అతను ఆ దివాణం పక్కనే చిన్నబంగళా కట్టించుకున్నాడు కూడాను.

* * *

'ఎటుతిరిగీ, చిక్కొచ్చేది అటూ ఇటూ కానివాళ్ల యిళ్లలోనే. స్వీయజీవనానికి గుడ్లు గూట్లోకొచ్చా యనుకునేవారికి అతిథులూ సహజీవనం సహించడం ఎక్కువ కాలం సాధ్యపడదు. మూడుగదులవాటాలో పెళ్లాంబిడ్డలతోటే చోటుచాలక అవస్థపడే ఆసామికి, అందులోనే మరి ఐదుగురితో సహజీవనం చేయవలసివస్తే అది 'ఇరకాటం'గానే ఉండక తప్పదు. దానికి తోడు ఆ వచ్చిన అతిథులు సర్దుకుపోయే తరహా అయితే గృహస్థు ప్రాణానికి సినిమాకథంత పని అవుతుంది. ఓవల్టిన్ దొరకదంటే, బోర్నవిటాతోనూ, మధ్యాహ్నం స్వీటు కాకపోతే కారంతోనూ, రెండుపూట్లా కూరలేకపోతే, ఒకపూట వేపడంతోనూ, కొన్నికూరలు గిట్టకపోతే మిగతా వాటితోనూ, బట్టలు చిరిగినా మాసినా ఇంటివారి వస్త్రాభరణాలతోనూ, ఇంటాయన తాలూకు చవకరకం సిగరెట్లతోనూ, ఆయన తెప్పించుకునే తెలుగు పత్రికతోనూ, ఆయన కాసేపు బతకడానికి దాచుకున్న రెండు గంటల కాలంతోనూ ఆయనలో దొరికిన కాసిని లోపాలతోను, ఆయన కుటుంబంలో దొరికిన కొద్దిపాటిగొడవలతోను, గుట్టుమట్లతోనూ, ఆయనకున్న నిరుపేదవైన ఇరుగుపొరుగులతోను ఎక్కడికక్కడే అని ఎలాగో సర్దుకుని కాలక్షేపం చేసే అతిథులు బొత్తిగా లేరనికాదు.

ఈ సదుపాయాలన్నీ మరోచోటజరక్క కాదు. ఇక్కడేపాటి ఉన్నాయో చూద్దామని పరీక్షచేసి చక్కాపోడానికో, ఉండడానికో మాత్రమే వస్తారు కొందరు. వైద్యంకోసమో వ్యాజ్యంకోసమో, చదువుకోసమో సంస్థకోసమో, కేవలం విశ్రాంతికో, ఊరు చూట్టానికో, ఉద్యోగం వెతుక్కోడానికో మాత్రమే అందరూ వస్తారనుకోవడం పొరపాటు.

నే నెరిగిన ఒక నరసింహారావుగారు ఎప్పుడూ పెద్ద పెద్ద ప్లానులమీద ఉంటాడు, గృహస్థుకు ఉపకారం చేయాలని. ఆయన సాధారణంగా దిగీదిగగానే గాని, ఆ పూట గాని అసలు సంగతి చెప్పడు. "ఒక్క పెద్ద విషయం మాట్లాడాలి నీతోటి. తీరికగా చెప్తాలే...ఇవాళ ఏదో హడావుడిగా ఉన్నావు రేపు చూద్దాంలే" అంటాడు. మర్నాడు రాత్రి భోజనాలయ్యాక హాల్లో

పక్క వేయించేస్తా డాయనే. అంతా నిద్రపోయేదాకా లోకాభిరామాయణం మాట్లాడి, ఆనక మిత్రుడిపక్కలో కూర్చుంటాడు. ఎప్పుడొచ్చినా గెంతు బ్రహ్మాండమైన ప్రాజెక్టులు లేకుండా రాడు.

"పంచవర్ష ప్రణాళికని ఆఫ్రికన్ భాషలలోకి, ఇంకా వెనకబడ్డ దేశాల భాషలలోకి తర్జుమా చేసి పదిలక్షలకాపీలు అమ్మితేఐదారు లక్షలు సునాయాసంగా కళ్ళజూడొచ్చు. అఫ్ కోర్సు అందుకు లక్షలకొద్దీ పెట్టుబడి నువ్వెక్కడ తెస్తావుగాని – దానికంతా ఉందిలే. కొలంబో ప్లానుకింద ఆస్ట్రేలియా చార్టర్డ్ బాంకువాళ్ళు అప్పలిస్తారు ఇలాటి పన్లకి. ఇప్పుడు మెడ్రాసు వెళ్ళి అక్కడ దొరల్తో మాటాడి అది శాంక్షను చేయించుకు రావాలి. అందుకో ఐదొందలుంటే సరిపోతుంది. ఈ బ్రహ్మాండమైన బిజినెస్‌కి నిజంగా ఈ ఐదొందలే అసలైన పెట్టుబడి అంటే నమ్ము.. అది నువ్విప్పుడు సర్దకపోతే నిల్చున పళంగా చచ్చిపోతాను. ఉత్తరక్రియలకో అను, నేను పోయాక యాడవడానికొచ్చే నా బంధుమిత్ర పరివారం తిండితిప్పలకీ, కాఫీ ఫలహారాలకీ, దుఃఖోపశమనం నిమిత్తం సినిమాలకీ, ఇతర సాదరుఖర్చులకీ వాళ్ళని సాగనంపడానికి రైలుఖర్చులకీ, రైల్లో ఫలహారాలకీ, చేబదుళ్ళకీ, అవి రావని తెలిశాక వదిలే తిలోదకాలకీ అంతా తడిసి మోపెడవుతుంది.. దానికన్న నాకీ ఐదొందలివ్వడమే చవక అని నరసింహారావుగారు విట్టీగా ఏడిచారు.

అలసిపోయిన గృహస్థు గురకని లాకేత్వమిచ్చే సన్నాహం అనుకుని, ఈయన గుక్క తిప్పుకోకుండా పైస్థాయిలో చెప్పినందువల్ల గృహస్థు నిద్రలోనే చనిపోవడం జరగలేదు. పైపెచ్చు మళ్ళా మన్నాడు నరసింహారావుగారు ఇదంతా ఇంత విట్టీగానూ చెప్పవలసివచ్చింది.

అంత డబ్బు రెడీగా లేకపోతే ఎక్కడైనా వడ్డీకి తెచ్చినాసరే నెల తిరిగేలోగా వాళ్ళ మొహాన పారేదామన్నాడు. ఒకవేళ అడిగిందికి నీకు జంకైతే, నీ తరఫున నేవెళ్ళి అడుగుతానన్నాడు. 'ఇన్సూరెన్సు కట్టినట్టున్నావు దానిమీదకూడా అప్పలిస్తారని ఓ అయిడియా చెప్పచూశాడుగాని గృహస్థు భార్యతో సలహా చేసినందువల్ల మెత్తబడలేదు.

నరసింహారావు గట్టివాడు కాబట్టి చలించలేదు. అక్కణ్ణించే అందరికీ ఉత్తరాలు రాస్తూ వచ్చాడు. అప్పు కావలెను అని పేపర్లో ఓ ప్రకటన వేసి ఆ యడ్రసే ఇచ్చాడు. ఆయన మిత్రులతో స్నేహం చేసుకుని అప్పులు సంపాదించేందుకు కృషి ఆరంభించాడు.

ఒకవేళ తాను చెప్పిన పబ్లిషింగ్ వ్యాపారం మిత్రుడికి నచ్చలేదేమోనని రెండో

అయిడియాకూడా ఓ మంచిరోజు చూసి చెప్పేశాడు. ఇదీ ఆఫ్రికాదే. అయితే పని లేదు. ఓ లక్ష మామిడికాయలకొని ఆవకాయ పెట్టించి ఎగుమతిచేస్తే ఎగరేసుకు పోతారట ఆఫ్రికన్లు. అమెరికాలో ఇలా ఆవకాయ అమ్మి కోటీశ్వరులైనవాళ్ళున్నారు.

## అతిథి దేవులు

మిత్రుడి కిదీ నచ్చలేదు. భార్యని సంప్రదించివచ్చి, "డబ్బు కుదర్దుగాని మా యింట్లో ఆవకాయుంది, అదీ కొన్ని మాగాయీ పెడతాను పట్టికెళ్ళమంటోంది మా ఆవిడ" అన్నాడు.

ఈ భీకర సమరం రెన్నాళ్లు సాగింది. ఈ లోగా నరసింహారావు ఓపార్టైము ఉద్యోగం చేశాడు. మిత్రుడింటి అరుగుమీదనే ఓ కిళ్లీ

కొట్టు పెట్టి నడిపించాడు. అతనికి రైలు ఖర్చులిచ్చి పంపిన తరవాత తెలిసిందినంతా.

అందరూ ఇలాటివారని కాదు. కొందరు అప్పుడుగరు సరిగదా రైలు ఖర్చులూ ఉంచుకుంటారు. కొందరు ఇంకా మంచి వాళ్లుంటారు. సకుటుంబంగా దిగి సామాను సద్దుకు స్థిమితపడ్డాక, నెమ్మదిగా మర్యాదలు తగ్గే వేళకి గృహస్థుకి వందో యాభయో అప్పిస్తారు. కాపోతే దాచమంటారు. అతనది తీర్చేలోగా తొందర ఉండదు. కొందరు ఇంటివాళ్ళు విసుక్కుంటున్నట్టు పసిగడితే "కావలిస్తే పాతికో పరకో పెట్టి పారేదాం' అనుకుని, అది ఎలాగో ముట్టచెప్పి [illegible] తరవాతనించి ఆ ముక్కే జ్ఞాపకంచేస్తూ గృహస్థుని అదుపాజ్ఞల్లో పెడతారు.

కొందరు బాబాయగార్లకు కోప మెక్కువ. ఇంటాయన పిల్లలు చదువుకున్నపుడు కూడా, బాబాయిగారు చిరాగ్గా ఉన్నారు, ఇహ చదువు కట్టెయ్యండి అని పిన్నిగారు చెప్పగల్దు. ఇంటి ఇల్లాలు పొద్దున్నే పూలు పేర్పించి ఇడ్లీను తెప్పించే సంప్రదాయం ఐదారురోజుల తరవాత ఆపెయ్యగానే, పిన్నిగారు తనకీ పిల్లలకీ ఇంటివాళ్ల పిల్లలచేత తెప్పించుకుంటుంది. "వాళ్లకి పెట్టకండే. పడదు. జరం గిరం వస్తే అదుగో చూశావా చుట్టపుమాపుగా వచ్చి పిల్లల్ని పాడుచేశారంటారు" అని ఆవిడ తనవాళ్ళకి హెచ్చరిక చేస్తుంది.

అసలు ఇల్లాలిదే తప్పు. అతిథులు దిగిన రోజున ఆ తరవాత రెండురోజులూ, తెల్లవారగానే, నాలుగిడ్లెన్నూ పెసరట్టూ ఉప్మా కాఫీ పుచ్చుకోడం ఈ సృష్టిలో సకల చరాచరాలకీ సహజధర్మమైనట్టుగా ఆవిడ అన్నీ తెప్పిస్తుంది. టిఫీను లేపోతే యెలా అని పిన్నిగారూ అంటుంది. మూడురోజులాయేసరికి పిన్నిగారూ పిల్లలూ ఆమాట నమ్మితే తప్పేముంది?

అచ్చొచ్చిన ఇల్లనీ, ఇక్కడకొచ్చి చదువుకున్నవాళ్లూ వైద్యం చేయించుకున్న వాళ్ళూ, పెళ్ళి సంబంధాలు వెతుక్కున్న వాళ్ళూ బాగుపడ్డారనీ తెలిసి ఏదో అభిమానంకొద్దీ వచ్చినవాళ్ళని సావకాశంగా ఆయా కార్యాలు చక్కబెట్టుకోనివ్వకుండా తొందరపెట్టడం తప్పుగదా. వాళ్లు చిరాకుపడటమూ సహజమేగదా.

ఒకాయన రెండోపిల్లకి పెళ్ళి సంబంధాలు వెతకడానికొచ్చి ఒక సుబ్బయ్యగారిల్లు హెడ్డాఫీసుగా పెట్టుకున్నాడు. [illegible]చ్చే సంబంధాలూ పోయే సంబంధాలూ, పెళ్ళిచూపుల కొచ్చినవారికి కాచమర్యాదలూ అన్నీ చాలకాలంగా సక్రమంగానే జరిగాయి. అంతలో సుబ్బయ్యగారి పిల్లకూడా పెళ్లీడు కెదిగింది. అంతట ఆయనా నడుం కట్టుకుని తనపిల్లకీ చుట్టంగారి పిల్లకీకూడా సంబంధాలు వెతికాడు. ఇద్దర్నీ ఒకేసారి ఎవరైనా చూడవస్తే అవసరమని. మరోసెట్టు నగలుకూడా చేయించాడు. చివరికి పెళ్లిళ్లు రెండూ ఒక్కచోటనే జరిగిపోయాయి. ఆ గురికొద్దీ విశ్వాసంకొద్దీ ఆ తరవాత ఆయన, తానెరిగిన వారి పిల్లలెవరికైనా సంబంధాలు దొరక్క అవస్థపడుతుంటే, సుబ్బయ్యగారి యడ్రసిచ్చి పంపేసేవాడు. చిన్నా పెద్దాపన్లు ఎవరికేమి ఉన్నా ఇక్కడికే పంపేస్తూ ఉండేవాడు.

పెళ్ళిలో సుబ్బయ్యగారు తన సొంతకూతురుకి జరిపించినన్ని ముచ్చట్లు ఈయన పిల్లకి జరపలేదన్న అక్కసుకొద్దీ ఇలా పగసాధించాడని కొందరంటారు గాని అది గిట్టనివాళ్లు [illegible]నేమాట.

* * *

విజయవాడ, చెన్నపట్నాలలోను, తిరుపతికి వెళ్లేదారిలో ఉన్న ఊళ్లలోనూ ఉండే వారి కిలాటి సమస్యలుండవు. అతిథులు ఇవాళ దిగితే ఎల్లుండి చక్కా పోతారు. (ఈరెండ్రోజుల్లోనూ ఊరు చూపించడానికయే ఖర్చుతో రెణ్ణెల్ల గ్రాసం వస్తుందన్నది అతిశయోక్తి.) అయితే ఇక్కడ ఒక్క చిక్కుంది. మూడేసిరోజుల్లో అతిథులు వెళ్లిపోయినా, మూడేసి రోజులకో కొత్త సజ్జు దిగుతూనే ఉంటుంది. వాళ్లలో చాలమంది కొన్నేళ్ల తరవాత మొట్టమొదటిసారిగా చూడ్డానికొచ్చిన వాళ్లయిఉంటారు.

అందువల్ల ఎవరిమటుకువారికే మర్యాదల్లో లోపం జరక్కూడదు. రాక రాక వచ్చిన వాళ్ళకోసం ఇంటాయన ఒక్కపూటేనా ఆఫీసుకు సెలవు పెట్టకపోవడం పొగరుమోత్తనం. అందువల్లనే యీ పట్నాల్లో ఉద్యోగులు పై ఆఫీసర్ల చేత విధిగా చీవాట్లు తింటూ ఉంటారు.

అతిథులవల్ల మానవజీవితానికి జరుగుతున్న మహోపకారాల్లో ముఖ్యమైన దొకటుంది. ఎప్పుడూ ఒక్కచోటే ఉండేరకర కాకుండా ఇలా వచ్చి అలా పోయేవారు, నిత్యం వస్తూ పోతూ ఉండేట్లయితే [illegible] గృహస్థు ఇల్లు నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంటుంది. భార్యాభర్తలు గట్టిగా తగవులాడుకుందికి వీలుండదు. దుఃఖపడిందికి తీరుబాటుండదు. ఎల్లప్పుడూ చిలకా గోరింకల్లాగ అభినయించడంవల్ల అదే అలవాటయిపోయి, వాళ్ళకి తెలీకుండానే వాళ్ళు ఆనందంగా జీవితమంతా ఒక పండుగలా అరగిస్తారు. పిల్లలకీ హాయే. అల్లరిచేసినా అమ్మా నాన్నా కొట్టిందికి వీలుండదు. చిరుతిళ్లు దొరుకుతాయి. చుట్టాలతో సినిమాలకి పోవచ్చు. చుట్టాలు కజ్జాకోర్లై, ఇవతలవాళ్లు రుసరుస లేలా పోట్లాడుకుంటేతప్ప అంతా బాగానే ఉంటుంది.

ఎవరో ఒకరింటికి వెళ్ళడంవల్ల చుట్టాలకీ జీవితంలో అప్పుడప్పుడు మూడేసి రోజులు మూడేళ్ళకి సరిపడే శాంతి, సంతోషం లభిస్తాయి. బాధ్యతారహితంగా హక్కులను అనుభవించవచ్చు. మర్యాదకోసమైనా దిగులు మొహం, తగవులాట దాచుకోవచ్చు.

కొత్తబట్టలు చేతులారా కొనుక్కోలేని

(61-వ పేజీ చూడండి)



"ఇంకా కాస్త వెనక్కి వెళ్లారంటే పూర్తిగా పడగలరు!..."

చిత్రకారుడు—ఆనందరావు (మదరాసు)

# రాశిఫలాలు

—దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి.

7-9-60 బుధవారం మొదలు.

13-9-60 మంగళవారం వరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రతి విషయంలోను దూరదృష్టితో మెలగగలుగుతారు. వృత్తిలో స్థిమితమైన కాలం. నౌకరులు మీయందు భక్తి శ్రద్ధలతో ఉంటారు. మీరు చేస్తున్న ఖర్చులో కొంత దుబారా అవుతున్నదనే విషయం తెలుస్తుంది. మాట నేర్పుతో మిమ్మల్ని ఇరకాటంలో పెట్టటానికి ప్రయత్నించేవారుంటారు. అయితే దైవికంగా బాధ్యతలు తొలగిపోతవి. క్రొత్త ప్రయత్నాలకు ఉత్సాహం కలుగదు. కుటుంబంలోనివారి అనారోగ్యంవల్ల ఖర్చులు పెరుగుతవి. బాహ్య విషయాలలో దర్పము, మాట విలువ పెరుగుతవి. 8,9 లలో సుఖము, బంధుదర్శనం, ధనలాభం.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీరు ఏపని చేస్తున్నా వెనక విమర్శించేవారు ఉంటారు. ధనాదాయం బాగుంటుంది. స్వయంకృషితో సంఘంలో స్థానాన్ని కాపాడుకొంటారు. అనుకున్న ప్రయాణాలు నిలుపుకోవలసిరావచ్చు. బంధుమిత్రులవల్ల అనుకూలత కనుపిస్తుంది. ప్రతిపనీ శ్రమపడి సాధించుకోగలుగుతారు. సకాలంలో నిద్రాహారాలు ఉండవు. మొత్తంమీద సాటివారిలో ప్రసిద్ధిపొందగలుగుతారు. స్నేహితులకష్టాలలో సౌఖ్యం కలిగించుకోవలసివస్తుంది. వస్త్రాలు ఆభరణాలు మొదలయినవి కొంటారు. తూర్పు దక్షిణదిక్కులనుంచి శుభవార్తలు తెలుస్తవి. 11,12 లలో అకస్మాత్తుగా కలహప్రసంగాలు వృత్తిలో చిక్కుసమస్యలు.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

పట్టుదలతో తోటివారికి న్యాయాన్ని చేకూర్చగలుగుతారు. ప్రతిబంధకాలు రావచ్చు. కాని నేర్పుతో ఎదుర్కొని జయించుకొనగలుగుతారు. ఈ సమయంలో ప్రతివిషయము రహస్యంగానే ఉంచటం అవసరం. కుటుంబంలోని పరిస్థితులు చాలావరకు అనుకూలంగా ఉంటవి. ఆదాయం మామూలుగానే ఉంటుంది. అధికారులతో పేచీలు రాకుండా సర్దుకుపోవటంమంచిది. వ్యాపారస్థులకు అనుకూలమైన సమయం. విద్యార్థులకు చిరాకు, సందేహాలు అధికం.

> **గ్రహస్థితి**
>
> వృషభ మిథునాలలో అంగారకుడు, సింహంలో సూర్య రాహువులు, సింహ-కన్యలలో బుధుడు, కన్యలో శుక్రుడు, ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు, మీన, మేష, వృషభ, మిథునాలలో చంద్రుడు.

ఇతరులతో కలసిచేయు వ్యాపారంవంటి పనులలో సంతృప్తికరమైన ఫలితం కనుపిస్తుంది. 7, 8 తేదులలో పుణ్యకార్యాలు. అనుభవంలో క్రొత్తవిషయాలు తెలుసుకుంటారు.

**కర్కాటకం**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

మీరు ఎంత ఓర్పుతో ఉన్నా పరిస్థితుల బలవంతంవల్ల కలహాలకు దిగవలసి వస్తుంది. సాటివారిలో పేరు ప్రతిష్ఠలు బాగుంటవి. ఒకటి రెండు సందర్భాలలో అధిక వ్యయం చేసి స్వల్పఆదాయాన్ని పొందవలసివస్తుంది. డబ్బుకు సంబంధించిన లెక్కలలోను, వ్యవహార పరిష్కారాలలోను పొరబాట్లు జరుగకుండా చూచుకొనటం అవసరం. సంతానంవల్ల సుఖసౌఖ్యాలు లభిస్తవి. వృత్తి ఉద్యోగాలలో మీ సమర్థత, నిర్వహణశక్తి పెరుగుతవి. ఇతరుల వద్దనుంచి రావలసిన ధనం వస్తుంది. తలవని తలంపుగా ప్రయాణం చేయవలసి రావచ్చు. ఆందోళన క్రమంగా తగ్గుతుంది. 12, 13 లలో అధికారులతో సమావేశం, శుభ సంబంధమైన ఖర్చులు.

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

అత్యాశకు చట్టా వ్యాపారంవంటి పనులలో ప్రవేశించతగిన సమయం కాదు. మీకు మంచివిషయాలు చెబుతున్నట్లు నటిస్తూ మీ మిత్రులను గురించి చెడు ప్రచారానికి ఆరంభించే మనుష్యులుంటారు. మీ ఆరోగ్యం లోపిస్తుంది. వ్యవహారరంగంలో అనుకూలమైన సమయం. అగౌరవమైన పనులయందు ఆసక్తి కలుగుతుంది. మనోనిబ్బరం అవసరం. కుటుంబంలో మీరు అనుకున్న విధంగా పనులు సకాలంలో నెరవేరకపోవచ్చు బంధుమిత్రులరాకపోకలు, అందువల్ల ఖర్చులు పెరుగుతవి. సాధ్యమైనంతవరకు అప్పులు చేయకుండా ఉండటం మంచిది. దుర్గా సహస్రనామ పారాయణంవల్ల కష్టములు తొలుగుతవి. 9, 10 లలో గౌరవ ప్రాప్తి, వినోద కార్యక్రమాలు, మిత్రలాభం.

* * *

**కన్య**

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

పేరుకోసం పెనుగులాడవలసిన సమయం. ఇతరులవల్ల లభించే గౌరవంతోబాటు శ్రమ, ఖర్చులు పెరుగుతున్నవనే విషయం మరచిపోవద్దు. సంతోష సమయాలలో కష్టవార్తలు తెలుస్తవి. త్రిప్పటతో కూడిన కార్యక్రమాలు అధికంగా వుంటవి. రాజకీయ రంగంలో తాత్కాలికంగా ఫలితం ఉండదు. వృత్తిలో ఆయా సమయాలలో జరుగవలసిన పనులు జరుగపోవటంవల్ల అతి శ్రమతో మాటదక్కించుకొంటారు. ఇతరులవద్దనుంచి ఎదురుచూస్తున్న శుభవార్తలు సకాలంలో వస్తవి. వాహనాలు ఉపయోగించటంలో జాగ్రత్త అవసరం. 9,10 లలో కారణం లేని ఆందోళన, వృథాఖర్చులు, శ్రమ.

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ముఖ్యంగా ఆరోగ్య విషయంలో సంతృప్తి కనుపిస్తుంది. ఎంత శ్రమకరమైన పనిని కూడా సులభంగా చేయగలుగుతారు. మిమ్మల్ని చాటున దూషించినవారు మీ ఎదురుగా అణగిపోతారు. బంధువులవద్దనుంచి రావలసిన వార్తలు సకాలంలో రాక ఆందోళన కలుగుతుంది. అప్పులు తీయవలసిన అవ

శరం కలుగుతుందికాని, తిరిగి వస్తుందని నమ్మ వద్దు. మీ కార్యక్రమాలను సాధ్యమైనంత రహస్యంగా వుంచుకోనటం మంచిది. ఖర్చులు తగ్గించుకోనటం అవసరం. కుటుంబంలో కలహ ప్రసంగాలువచ్చి సమ[illegible] పోతవి. వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి కనుపిస్తుంది. 11, 12 లలో ధనయోగం, కీర్తి ప్రతిష్ఠలు.

*　　*　　*

**వృశ్చికం:**

(విశాఖ 4[illegible] పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మనస్సులో అనేక ఆలోచనలు, పరధ్యానం ఎక్కువ. ఎప్పటికప్పుడు విధిలేక పనులు నెరవేర్చవలసివస్తుంది. దేవుని దయవల్ల మీ వాక్చాతుర్యంతో పొరపాట్లు లెక్కకు రాకుండా చేసుకోగలుగుతారు. మానసికంగాను, శారీరకంగాను బలహీనత కనుపిస్తుంది. ఏ విషయంలోను లోపం అనేది ప్రత్యక్షంగా కనుపించదు. గౌరవ ప్రతిపత్తులు బాగుంటవి. కుటుంబంలో శుభ సంతోషాలు లభిస్తవి. వారం రెండవ భాగంలో వృత్తిలో ఉత్సాహ సూచన లున్నవి. ధనాదాయం పెరుగుతుంది. కార్య భారంకూడా క్రమంగా తగ్గుతుంది. 7, 8 లలో శుభవార్తలు, బంధుమిత్రులతో సమావేశం.

*　　*　　*

**ధనుస్సు:**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ప్రథమ పాదం)

ఎవరు ఏమి చెప్పినా మీ మనస్సుకు న్యాయంగా తోచినదానిని చేసుకునిపోవటం మంచిది. ప్రతిబంధకాలు వచ్చినా పనులు మాత్రం ఆగవు. మొదట మీరు అనుకున్న దానికంటె ఎక్కువ ఫలితాన్ని పొందగలుగుతారు. పెద్దమనుష్యుల స్నేహము, సహాయము లభిస్తవి. మీ ఉత్సాహాన్ని తగ్గించే వార్తలు చెప్పేవారుంటారు. జాగ్రత్త. ధన సంబంధమైన చిక్కులు తొలగి మనశ్శాంతి లభిస్తుంది. ప్రయాణాలు చేయవలసిరావచ్చు. మీ మాటలో ధోరణివల్ల ఇతరుల మనస్సుకు బాధ కలిగే అవకాశా లున్నవి. ఇతరులకు సహాయం చేయగలుగుతారు. 9, 10 లలో సంఘంలో గౌరవం. స్వయంకృషితో కార్యసిద్ధి.

*　　*　　*

**మకరం:**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

ప్రతిపనీ మరుక్షణంలో జరుగబోతున్నట్లు కనుపిస్తుంది. ప్రతి వ్యక్తి మీతో అనుకూలంగా ఉన్నట్లే నటిస్తారు. కాని నమ్మి వృథాప్రయాస పడవద్దు. ఏపని చేసినా భారం ఎక్కించుకొన్నట్లుగా తయారవుతుంది. రావలసిన ఉత్తరాలు సకాలంలో రావు. అథవా వచ్చినా మనస్సుకు ఆదుర్దా, ఫలితం లేకపోవటం, ఆరోగ్యం కూడా సంతృప్తిగా ఉండదు. పటాటోపం కోసం శ్రమపడవలసి వస్తుంది. ఎంత జాగ్రత్తగా ఉందామనుకున్నా కొన్ని సమయాలలో తప్పనిసరి అవుతుంది. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. బంధువుల రాకపోకలు. 11, 12 లలో కుటుంబంలోనివారికి అనారోగ్యం, కలహ ప్రసంగాలు.

*　　*　　*

**కుంభం:**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

చేయవలసిన పని కంటిముందు కనుపిస్తున్నా సాధ్యమైనంతవరకు తప్పకుండామని ప్రయత్నిస్తారు. దేహశ్రమ అధికం. ఏ విషయంలో జోక్యం కలిగించుకున్నా అపవాదులు ఎదురు అవుతవి. వృత్తి ఉద్యోగాలలో మీ మార్గానికి ప్రతిబంధకాలు కనుపిస్తుంటవి. కాని, నిగ్రహించుకో గలుగుతారు. ఆదాయం మామూలుగా ఉంటుంది. కలహ ప్రసంగాలనుంచి సాధ్యమైనంతవరకు తప్పుకొనండి. ప్రయాణాలు అనుకూలించవు. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. 9, 10 తేదులలో మిత్రలాభం, సంఘంలో గౌరవం.

*　　*　　*

**మీనం:**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

శత్రువులను జయించగలుగుతారు. ఇంతకు ముందుకన్నా మీ ఆరోగ్యం బాగుంటుంది. [illegible]స్తి వృద్ధి ప్రయత్నాలకు అనుకూలమైన సమయం. విలాస వినోదాలకై ఖర్చులు. కుటుంబంలోనివారి ఆరోగ్యం బాగుండదు. దూరమందున్నటువంటి మిత్రులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. నీచులతో కలహాలు రాగల అవకాశాలున్నవి. వృత్తివ్యాపారాలలో మీ అంతస్తు పెరుగుతుంది. ఇతరుల చిక్కు సమస్యలను తీర్చగలుగుతారు. 7, 8 లలో శుభవార్తలు, సంచారం. 

## ఈ వారము ధరలు

బంగారుధర క్రమంగా పెరిగే అవకాశాలున్నవి. 11, 12 లలో మంద సూచన. వెండిధర గతవారం వలెనే ఉంటుంది. పసుపుధరలో తేజీ సూచనలు కనుపిస్తవి. వేరుశనగపప్పు నూనె ధరలు తేజీలోనే ఉంటవి. 8, 9 లలో మాత్రం కొద్దిమందీ. నూవుల నూనెధర తేజీ, (కొద్దిగా) మిర్చిధర బాగున్నా చలామణి తక్కువ. గోధుమలధర మందీ అవుతుంది. శనగలకు వారం ఆరంభంలో గిరాకివచ్చి తగ్గుతుంది.



# నాటక ఫలితాలు

సాయంత్రం ఆరుగంట లయింది. అంటే విశాఖపట్టణం వీధు లన్నీ వింత శోభతో వెలిగిపొయ్యే సమయమన్నమాట. ఖరీదైన ప్యాంట్లు, షర్టులూ, చీరలూ వగైరా వగైరా కట్టుకొని విడివిడిగానూ, జంటలు జంటలుగాను ఉషారుగా ఉల్లాసంగా తిరిగే సమయం అది......

సూర్యారావు 'లలితా నగర్'లో ఇంటి లోంచి బయలుదేరి నెమ్మదిగా 'డాబా గార్డెన్సు'కు వస్తున్నాడు. ఆయనకు ఎప్పుడూ బస్సుకోసరం కాచుకునే అలవాటులేదు. ఈ విశాఖపట్టణంలో బస్సులు ఎంత బాగా నడుస్తాయో ఆయనకు బాగా తెలుసు! అందుకనే యాభై రెండు సంవత్సరాల వయస్సులోకూడ ఎక్కడికయినా వెళ్ళ దలచుకొంటే బస్సుకోసం కాచుకూర్చోకుండా నడిచే బయలుదేరుతాడు ఎప్పుడయినా దారిమధ్యలో బస్సువస్తే ఎక్కుతాడు. అంతే.

సూర్యారావు, స్నేహితుడు రంగనాథం ఇంటిముందుకొచ్చి ఆగాడు. తలుపు వేసి ఉండటంచేత తలుపు తట్టబోయి లోపలినుంచి స్నేహితుని గొంతు తీక్షణంగా వినబడటంచేత ఆగాడు. అతని స్నేహితుడు రంగనాథం గొంతు పెద్దగా వినబడుతోంది. "......ఇన్నేళ్ళొచ్చినయ్! ఇంకా మీకు బాధ్యత ఎప్పుడు తెలుస్తుందిరా? ఈ ముసలితనంలోకూడ ఇంకా నేను పాకులాడాలా! ఛీ! ఛీ!......"

సూర్యారావు తలుపు తట్టుతూ "రంగనాథం" అని పిలిచాడు.

రంగనాథం బయట కొచ్చాడు. ఆయనకు ఏభై సంవత్సరాలపైన వయస్సు ఉంటుంది. రైల్వేలో ఉద్యోగం చేస్తున్నాడు. ముఖం కోపంతో ఎర్రబారింది. స్నేహితుని చూసి "పదరా సూర్యం" అని తువ్వాలు భుజంమీద వేసుకొని బయలుదేరాడు. రోజూ అట్లా ఇద్దరుస్నేహితులు షికారుగా సముద్రపు తీరానికి (విశాఖపట్టణంలో సముద్రపు తీరాన్ని ఎవరైనా 'బీచ్' అంటే వాళ్ళపాపాన వాళ్ళే పోతారు. అయినా అంతసాహసం ఎవరూ చేయరు. ఎందుకంటే సాయంత్రంవేళ పగలంతా పడ్డ శ్రమను మర్చిపోయి చల్లగా కొంసేపు సుఖం అనుభవిద్దామని సముద్రతీరానికి వస్తారా, అక్కడే కొందరు మలమూత్ర విసర్జనాలు చేసుండటం చూస్తూ ఆ సముద్ర తీరాన్ని 'బీచ్' అనగల ధైర్యసాహసాలు ఎవరికుంటయ్. పోనీ ఎలాగో అనేద్దామను కొన్నా మనస్సు ఒప్పుకోవద్దూ) వెళ్ళి కొంసేపుకూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకొని ఇంటికి వస్తారు.

ఇవ్వాళ ఇద్దరూ మామూలుగా పెద్దబజారు




గుండా నడుస్తున్నారు. వాళ్ళు రోజూ సముద్రతీరానికి పెద్ద బజారులోంచే వెడతారు. ఎందుకంటే సూర్యారావుకు పెద్ద బజారులో ఫ్యాన్సీ షాపు ఉంది. అక్కడొక అయిదు నిముషాలు ఆగి సూర్యారావు మంచి చెడ్డలు కనుక్కుంటాడు. ఇన్నేళ్లూ సూర్యారావు స్వయంగా కొట్లోకూర్చుని వ్యాపారం సాగించాడు. సగర్వంగా చెప్పుకో దగ్గంత ఆస్తి సంపాదించాడు. ఇప్పుడు ఆయన పెద్దకొడుకు 'సత్యం' వ్యాపారం నిర్వహిస్తున్నాడు.

సూర్యారావు తన దుకాణందగరకు రాగానే "రంగనాథం ఒక్కసారి లోపలికి వెడదాం రా" అని తీసుకెళ్ళాడు.

లోపలికి వెళ్లి కొడుకును "విశేషాలేమిటి? " అని అడిగాడు.

సత్యం "ఏమీ లేవు నాన్నా" అన్నాడు. నిమిషం సేపు ఆగి తరువాత "వజ్రేంద్ర ఇండస్ట్రీస్ సంగతి..... " అన్నాడు.

"ఏది? ఆ షేర్స్ కొనడమేనా? వద్దన్నానుగా?"

"ఇంకోసారి ఆలోచించండి నాన్నా. ఎంతో లాభం......"

"ఆలోచించే చెప్పాను. సరే ఇంకేమయినా ఉందా?"

"ఏంలేదు. హేండ్ బ్యాగ్స్ రాజమండ్రి వాళ్ళకే ఆర్డరిచ్చేస్తాను."

"సరే. నేను వెడుతున్నాను." ఇద్దరు స్నేహితులు మళ్ళీ నడక సాగించారు. రంగనాథం ఇంకా 'సీరియస్' గానే ఉన్నాడు.

కొంతదూరం నడిచాక సూర్యారావు కుతూహలం ఇక చంపుకోలేక "రంగనాథం, ఏమిటి తీవ్రంగా ఆలోచిస్తున్నావ్?" అన్నాడు.

"ఆలోచించటానికేముంది? మా సుపుత్రులను గురించే. దిగులెక్కువయింది."

ఇంతలో సముద్రం దగ్గరికి చేరుకొన్నారు. మరీ అంత అసహ్యంగా లేనిచోటుచూసి కూర్చున్నారు.

"మీ సుపుత్రులనుగురించి అంత ఆలోచన ఏమిటోయ్?"

రంగనాథం జవాబు చెప్పలేదు. మళ్ళీ ఆలోచనలో మునిగిపోయాడేగాని మాట్లాడలేదు. మళ్ళీ ఇంకోసారి సూర్యారావు అడుగుదామని అనుకొనేలోపల రంగనాథం "అసలు ఈ సంగతి నీతో సంప్రదించి నిశ్చయించుకొందామనే ఎన్నిరోజులనుంచో అనుకొంటున్నాను" అన్నాడు.

"ఏ సంగతి?"

"అదే. అంతా వివరంగా చెబుతాను కదా" అంటూ రంగనాథం మళ్ళీ రెండు నిముషాలు మౌనం వహించాడు.

స్నేహితుని ఇంతగా బాధించే సమస్య ఏమిటో సూర్యారావుకు అర్థంకాలేదు. నిన్నటిదాకా నిశ్చింతగా కనిపించాడే! ఈ ఇరవై నాలుగు గంటల్లో వీడిని ఇంతగా తికమకపర్చిన సమస్య ఏమిటి?

"మా సుపుత్రులను తలుచుకొంటూంటే దిగులుతో ఒక్కొక్కసారి అన్నంకూడ సయించడం లేదురా". చివరికి తన మనోవ్యథకు మూలకారణం బయటపెట్టాడు రంగనాథం. ఆయనకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు ఉన్నారు. కూతురికి పెళ్ళిచేసి అత్తవారింటికి పంపాడు. పదేళ్ళక్రితమే భార్యపోతే ఆయన విధవ చెల్లెలు వచ్చి ఆయన సంసారాన్ని గడుపుతోంది...

"ఇన్నాళ్ళూ లేని దిగులు ఇప్పుడు అకస్మాత్తుగా ఊడి పడిందా ఏమిటి?" అన్నాడు సూర్యారావు.

"ఇన్నాళ్ళూ లేకేం? కాకపోతే కడుపు చించుకొంటే కాళ్ళ మీద పడుతుందని నీతో ఎప్పుడూ అనలేదు".

"అంత దిగులుపడాల్సిం దేముందిరా? చక్కగా చేతికందొచ్చారు. ఏదో ఇంటర్ దాకా చదువుకొన్నారు. రేపో ఎల్లుండో ఏదో ఉద్యోగం చెతుక్కొంటారు. నీ జీవితం నిశ్చింతగా గడిచిపోతుంది."

"ఆఁ! నిశ్చింతగా గడిచిపోతుంది? యోగమే ఉంటే నాకీ దిగులెందుకు? ఇద్దరూ ఎదిగొచ్చారా? పెద్దాడికి ఇరవై మూడు, రెండోవాడికి ఇరవై ఒకటి వయస్సు. అయినా. ఇంటర్ తప్పారా? చదువుదామనే ధ్యాస ఇద్దరిలో ఎవరికీ లేదు. ఏదో నా పోరుమీద ఆ పరీక్షకు కట్టారు. మొన్న రాత్రి ఏదో దీక్షగా చదువుతూంటే నాకు కొంచెం ఆశ్చర్యంవేసి దగ్గరికి వెళ్ళి చూశాను. పెద్దవాడేమో, "హౌ టు ప్లే క్రికెట్", రెండోవాడు "హరిశ్చంద్ర" నాటకం చదువుతున్నారు. వాడికి క్రికెట్ పిచ్చి, వీడికి నాటకాల పిచ్చి బాగా పట్టింది. వాడు ఎప్పటికయినా ఇండియాకు క్రికెట్ కెప్టెను అయి తీరుతాడుట. వీడు సరేసరి అంతర్జాతీయ నటుడైపోతాట్ట...

"పోనీ వాళ్ళను ఆ లైన్సులో ఎంకరేజ్ చెయ్యరాదూ?"

"నిజమే చెయ్యొచ్చు కాని మన పరిస్థితి ఏమిటి? ఏ కారణంచేతనయినా నాకు రెండు నెలలు జీతం రాదనుకో, ఇంట్లో పస్తులుండటమో, అప్పులు చేయటమో చేయాలి. అప్పటికీ నేను ఎంతో చెప్పాను—ఉద్యోగాలు చేసుకొంటూనే మీ టార్గెట్ కోసరం ప్రయత్నం చెయ్యండి అని. ఊహూఁ! అలాకాదుట. ఉద్యోగాలు చేస్తే జీవితమే నాశనంట. ఇక చెప్పు. మొన్న రైల్వేలో ఏదో చిన్న ఉద్యోగాలకు ఖాళీలొస్తే ఇద్దరిచేత అప్లికేషన్ పెట్టించి ఆఫీసరుతో చెబితే ఆయన అట్లాగే అన్నాడు. కాని వీళ్ళు ఇంటర్వ్యూకే రాలేదు, ఏమిట్రా అంటే ఇద్దరూ చెరోక కారణం చెప్పారు. ఆమధ్య ప్రావిన్షియల్‌లో ఏదో టెంపరరీ ఖాళీలొస్తే మా స్నేహితుడొకడు ఇప్పిస్తానని ఇద్దరినీ తీసికెళ్ళాడు. ఇంటర్వ్యూలో ఆఫీసరు పెద్దవాడిని ఏదో అన్నాడుట. దాంతో వీడు సరాసరి బయటికొచ్చి రెండోవాడిని వెంట చేసుకొని ఇంటికొచ్చాడు..." రంగనాథం చెప్పటం రెండునిమిషాలు ఆపి కొంచెం ఊపిరి పీల్చుకొన్నాడు.

సూర్యారావు మౌనంగా వింటున్నాడు. ఇన్నాళ్ళూ తనతో ఒక్క విషయం కూడ

# నాటక ఫలితాలు

చెప్పకుండా రంగనాథం మనస్సులో ఎట్లా దాచుకొన్నాడా అని కొద్దిగా ఆశ్చర్యపోయాడు.

"ఇద్దరిలో ఎవరూ సంసారంలో ఏ సంగతీ పట్టించుకోరు. మొన్న కోమటి కొట్లోంచి సామానులు తీసుకురమ్మని చెప్పి ఆఫీసుకొచ్చాను. నన్ను అటుపోనిచ్చి, వాళ్ళత్తయ్యకేదో మాయమాటలుచెప్పి ఇద్దరు తేవటం మానేశారు. పాపం అదేమో కావలసినవి ఇరుగుపొరుగు ఇళ్ళల్లో అప్పుతెచ్చి వంట చేసింది. నేను ఇంటికొచ్చి ఏమిరా అంటే ఇద్దరు చెరోక కారణం చెప్పారు. ఏమంటాను చెప్పు? నా అంత అయ్యారు. పైగా పెద్దవాడికి పెళ్ళయి కోడలు కాపురానిక్కూడ వచ్చింది. ఇంకా బాధ్యత అంటూ తెలియదు. ఇదివరకు నాకు తెలియకుండా కోమటికొట్లో గుడ్డలు తీసుకొని ఖాతా రాశారు. ముందుగా చెబితే ఒప్పుకోనేమోనని చెప్పలేదుట. నలభై రూపాయలు, జీతంలోంచి ఇచ్చుకోవాల్సొచ్చింది. ఇంతకీ చొక్కాలు లాగులు లేక కాదు. వాడికి క్రికెటు డ్రస్సు, వీడికి సాంఘిక నాటకాల్లో వేసుకోడానికి పంచెలు కావాల్సి వచ్చినవట! ఇక గట్టిగా కోప్పడటానికి మనస్సు పీకుతుంది. తల్లి లేని పిల్లలు. వీళ్ళకు బాధ్యత తెలిసొచ్చేది ఎప్పుడా అని మనస్సులో బాధొకటి. సతమతమై పోతున్నాననుకో."

"ఎందుకంత బాధపడతావ్? తప్పనిసరి అయితే వాళ్ళకే బాధ్యత తెలుసొస్తుంది. అప్పుడు వాళ్ళంటవాళ్ళే చక్కబడతారు" అన్నాడు సూర్యారావు.

"ఎప్పుడు బాగుపడతారు? నేను 'హరీ' అంటే 'తప్పనిసరి' నేది వాళ్ళకు అప్పుడు ఏర్పడుతుందేమో?"

"ఛీ! ఛీ! అవేం మాటలు రంగనాథం?"

ఉపాధ్యాయుడు — పంచవర్ష ప్రణాళిక ప్రధానలక్ష్యం ఏమిటిరా?

గోపీ—ఏడాదికి ఒక వర్షం కన్న అధికంగా కురవకుండా చూడడం సార్!

—'రాజు' (ఏలూరు)

"నిజం! సూర్యం! ఇన్నిరోజులూ నీతో ఏమీ చెప్పలేదు. పైకి చీకు చింతా లేనివాడిలాగా కాలం గడుపుతున్నానన్నమాటే గాని మనస్సులో వీళ్ళను గురించి ఎంతగా కుమిలిపోతున్నానో నీకు తెలియదు. పెరిగొచ్చిన కొడుకులు చేతికందివస్తే తండ్రికి అంతకంటే కావలసిందీ, సంతోషమైనదీ ఏముంటుంది చెప్పు? మా పరిస్థితులు నీకు తెలుసు కదా? రేపొకవేళ నేను హఠాత్తుగా కళ్ళు మూస్తాననుకో, ఈ ఇద్దరి గతి ఏమిటి? అయినా ఇంత వయస్సు వచ్చినా బాధ్యత తెలుసుకోకపోవటం ఎంత సిగ్గుచేటు ...అందుకే వీళ్ళకు బాధ్యత తెలియచెప్పాలని నిశ్చయించుకొన్నాను."

"ఇంకేం? వాళ్ళకు నయానో భయానో తెలియచెప్పు."

"లాభంలేదు. ఎన్నిరకాల చెప్పానో నీకు తెలియదు. ఇక వాళ్ళను ఇంటిలోంచి వెళ్ళగొడితే, కొంతకాలం నానాగడ్డి తింటే అప్పుడు కళ్ళు తెరవొచ్చు. అయినా తల్లి లేని వాళ్ళను అనాథులుగా చేయటానికి మనసొప్పటంలేదు. అందుకే ఒక నాటకం ఆడి వాళ్ళకు బాధ్యతలు తెలిసివచ్చేటట్టుగా చేయాలని నిశ్చయించుకొన్నాను."

"అంటే..."

"అంటే, నేను కొన్నాళ్ళు వాళ్ళకు దూరంగా ఉంటాను..."

"వాళ్ళను అనాథులను చేస్తావన్నమాట......"

"అదికాదు చెప్పేది పూర్తిగా విను. ఎన్నిరోజులనుంచో నా ప్లాను ఎట్లా అమలులో పెట్టడమా అని ఆలోచించాను. ఇప్పుడు అవకాశం వచ్చింది. నన్ను ప్రమోషన్‌మీద నాగపూర్ ట్రాన్స్‌ఫర్ చేశారు. మొదటిలో అంతదూరం వెళ్ళటం ఎందుకులే వద్దని రాశిద్దామనుకొన్నాను. ఇప్పుడు ఇదీ మంచికేననిపిస్తోంది. మా చెల్లెలితో నా ప్లాను చెప్పి, దాన్ని ఒప్పించి మెల్లిగా దాన్ని తీర్థయాత్రలకు పంపించేస్తాను. మా వాళ్ళకు 'తొందరగా వచ్చేస్తానుగా' అని చెప్పి నేనొక్కడినే నాగపూర్ వెడతాను. అక్కడినుంచి నెలనెలా బొటాబొటీగా డబ్బు పంపుతాను. దాంతో వీళ్ళకు తమ సరదాలు తీరక, తమంతట తాము సంపాదించే అగత్యం తెలిసొస్తుంది. ఏమంటావ్?"

"తెలిసొస్తుందని నమ్మకం ఏమిటి? నువ్వు లేకపోవడంతో వీళ్ళు ఇంకా ఇక్కడ విచ్చలవిడిగా తిరుగుతూ అప్పులు చేసేసి అవన్నీ నీకు చుట్టుకోవా? అప్పుడు వీళ్ళే ఇంకా నాశనం కారా?"

"నీకొచ్చిన అనుమానాలే నాకూ వచ్చినయ్. వీళ్ళకు అప్పు ఇచ్చే దాత ఎవరు? వాళ్ళు అడిగితే నువ్వు ఇవ్వకు. మా ఖాతా

కొట్టులో అప్పు ఇక ఇవ్వవద్దని చెప్పేశాను. కోడలు ఉంది కనుక సంసార బాధ్యతలు నెత్తిన వేసుకోక తప్పదు. డబ్బు ఉండదు కనుక వీళ్ళ సరదాలు తీరక ఇబ్బందులు పడి, అప్పుడు ఎవరి కాళ్ళమీద వాళ్ళు నిలబడటం ఎంత మంచిదో, వాళ్ళకు వాళ్ళ ఆస్తులకు ఎంతమంచిదో తెలిసొస్తుంది."

"అయితే వాళ్ళు ఇక్కడ ఇబ్బందులు పడుతూండటం నీకిష్టం అన్నమాట."

"అదేమిట్రా అట్లాగంటావ్?"

"లేకపోతే ఏమిట్రా? వాళ్ళకు ఏదో రకంగా నచ్చచెప్పి దార్లోకితీసుకురావటం మాని ఇట్లా అవస్థలపాలు చేస్తావా?"

"నీకేం? నీకొడుకు లందరు చేతికందొచ్చారు కనుక నీకు ఇటువంటిసమస్యరాలేదు. నాబాధ నీకేం తెలుసు? వాళ్ళకు ఎన్నిరకాలుగా చెప్పాను? ఈపద్ధతి అవలంబించటానికి నా మనస్సు ఎంత కొట్టుకులాడుతుందో నీకు తెలియదు. కాని తప్పదు. వాళ్ళ మేలుకోరే ఇట్లాచేయవలసివస్తోంది...పోనీ, వాళ్ళు కష్టపడి చదువుకొంటూంటే అప్పుచేసో చదివించేవాడిని. అదీలేదు. ఆ క్రికెట్ పిచ్చి, నాటకాలపిచ్చి వాళ్ళను చెడగొట్టేనయ్. ఆర్ట్సు, స్పోర్ట్సులలో ఆసక్తి ఉండటం మంచిదే కాదనను. కాని అవి మనజీవితానికి ఆటంకం కలుగచేయకూడదు. మధ్యతరగతి కుటుంబీకులు ఎవరిపొట్ట వాళ్ళు పోసుకోకపోతే, వీళ్ళకళలు గమనించి ప్రోత్సహించి పోషించేదాత ఎవడున్నాడు చెప్పు?"

అప్పటికి రాత్రి ఎనిమిదికావస్తోంది. సూర్యారావులేచాడు. రంగనాథం అతనితోపాటులేచాడు. ఇద్దరూ ఇళ్ళకు బయలుదేరారు. "సరే నీఇష్టం. ఇంకోకసారి బాగా ఆలోచించుకో! అంతకంటే నేను చెప్పగలిగింది ఏమీలేదు" అన్నాడు సూర్యారావు రంగనాథాన్ని వదలిపెడుతూ.

* * *

సూర్యారావు ఇంటికెళ్లేసరికి ఎనిమిదిన్నరయింది. ఇంటిల్లిపాది, భోజనాలు చేయకుండా ఆయనకోసం కాచుకూర్చున్నారు.

సత్యం తండ్రిని చూడగానే "ఇంతఆలస్యమయిందేం నాన్నా ఈ వేళ?" అని అడిగి జవాబుకోసం నిరీక్షించకుండా తల్లినుద్దేశించి "అమ్మా ఇక అన్నాలు పెట్టవే నాన్న వచ్చారు" అన్నాడు.

ఆ ఇంట్లో తప్పనిసరిఅయితేతప్ప అందరూ కలిసి భోజనాలు చేయటం అలవాటు. సూర్యారావు ఈ నియమం పాటిస్తాడు. అందుకని కొడుకులు ముగ్గురు ఎవరిష్టం వచ్చినట్టు వాళ్ళు భోజనాలుచేసి తమతమపనులకు పోవటం జరగదు.

భోజనాలదగ్గర రెండో కొడుకు గోపాలం మెల్లిగా "నాన్నా నాసంగతి ఏమాలోచించారు?" అన్నాడు.

సూర్యారావు తలఎత్తకుండా అన్నం తింటూనే "ఏసంగతిరా?" అని అడిగాడు.

"అదే నాన్నా, ఆ కంపెనీ బ్రాంచి మానేజరు ఉద్యోగం......" గోపాలం బి.ఎ అయిపోయిన తరువాత సెంట్రల్ గవర్నమెంటులో పనిచేస్తున్నాడు. ఇప్పుడు ఒక పెద్దకంపెనీ తెనాలిలో బ్రాంచిపెడుతూంది. దానికి మేనేజరు ఉద్యోగం, రెండు వేల రూపాయలు డిపాజిట్టు కట్టగలిగితే దొరుకుతుంది. ఆ రెండువేలు ఇమ్మని తండ్రిని నాలుగురోజులక్రితం అడిగాడు. అప్పుడు సూర్యారావు "ఆలోచించి చెబుతానే" అన్నాడు. ఆసంగతే గోపాలం ఇప్పుడు గుర్తుచేశాడు.

"నేను ఆలోచించి చూశానురా. ఇప్పుడు చేస్తున్న ఉద్యోగం వదులుకొని ఇందులో దిగటం-అందులో రెండువేల రూపాయలు డిపాజిట్టు కట్టటం-నాకేమీ నచ్చలేదు."

"అదికాదు నాన్నా. డిపాజిట్టు మనకు మళ్లీ వడ్డీతోసహా వచ్చేదేగదూ? అదీకాక మూడొందలు జీతం..."

"ఎంతయినా కానీరా, ఈ ప్రయివేటు కంపెనీలను నమ్మటం నాకు ఇష్టంలేదు. రేపు దివాలాతీసిందంటే, ఆ రెండు వేలూ దక్కవు. నీఉద్యోగం సరేసరి."

ఇంతలో ఆయనభార్య సత్యవతి కొడుకు తరఫున "వాడు అంత ఆశగా అడుగుతూంటే ఒప్పుకోరాదుటండీ - వాడి అదృష్టం ఎట్లా ఉందో ఎవరుచూశారు?" అని 'రికమెండ్' చేసింది.

"నీకు తెలియదు నువ్వూరుకో" అని సూర్యారావు భార్యను కసురుకొన్నాడు.

ఆవిడ మరి మాట్లాడలేదు.

"నాన్నా......" అని గోపాలం ఇంకా

## నాటక ఫలితాలు

ఏదో చెప్పబోతూంటూంటే సూర్యారావు మధ్యలోనే "నాకు ఇష్టంలేదురా. అంతకంటే మీ డిపార్ట్మెంటులోనే టెస్టులు ప్యాసయితే మూడొందలు గవర్నమెంటే ఇస్తుంది. కష్టపడి చదువు. అంతే" అని నిశ్చయంగా చెప్పాడు. గోపాలం మళ్లీ నోరెత్తలేదు.

ఆరాత్రి పడుకోబోయేముందు సూర్యారావుకు రంగనాథం విషయం గుర్తుకొచ్చింది. "పాపం! మానవుడు! ఎంత కుమిలిపోతున్నాడో. వాడిమాటల్లోనే మనస్సులో బాధ తెలుస్తోంది......కొడుకులు చేతికందొచ్చి తండ్రిమాట తు. చ. తప్పకుండా పాటిస్తూంటే కలిగే సంతోషం అనుభవించిన నాబోటివాడికే తెలుస్తుంది. నాకు మరే దిగులూ లేదు. పెద్దవాడు ఆ కొట్టుమీదే జీవితం గడిపేస్తాడు. వాడిదిగుల్లేదు. రెండో వాడు బి. ఎ. అయిపోయిందిగా. ఈ ఉద్యోగంలోనే పైకివెళ్లి ఎప్పటికయినా ఆఫీసరు అయిపోతాడు. మూడోవాడిని ఈ ఇంటర్ కాగానే ఆనర్స్‌లో చేర్పిస్తాను..." ఇట్లా ఆలోచించుకొంటూ నిద్రపోయాడు సూర్యారావు.

తెల్లవారింది. తెల్లవారకమునుపే సూర్యారావు ఇంట్లో అందరూ లేస్తారు. సూర్యారావు నాలుగున్నరకే లేస్తాడు. అయిదున్నర తరువాత ఎవరయినా నిద్రపోతూంటే ఊరుకోడు. అందుచేతనే పుట్టింట్లో ఏడున్నర దాకా నిద్రలేచే అలవాటు లేకపోయినా గోపాలం పెళ్ళాం లలిత కాపురానికొచ్చాక తెల్లవారుఝామునే నిద్రలేవటం అలవాటు చేసుకొన్నది.

ఆరుగంటలయింది. అప్పటికే సూర్యారావు స్నానంచేసేసి జపం చేసుకొంటున్నాడు. ఆయన మూడో కొడుకు మురళి వచ్చి "నాన్నా సబ్బు అయిపోయింది" అన్నాడు.

సూర్యారావు జపంలో ఉండి మాట్లాడలేదు. పావు గంట అయిన తర్వాత కళ్ళు తెరిచి కొడుకును చూచి "ఏమిటిరా" అని అడిగాడు.

"సబ్బు అయిపోయింది నాన్నా."

"అదేమిట్రా పదిరోజులకే అయిపోయిందా? ఇట్లా అయితే సంసారం బాగుపడినట్టే. ఇక సబ్బులు మానేసి అందరూ కుంకుడుకాయలు రుద్దుకోండి" అంటూ లేచి స్టోరురూము తాళంతీసి సబ్బుతీసి కొడుక్కు ఇచ్చాడు. 'హోల్ సేలు'గా కొంటే చవుకగా వస్తాయి కనుక ఆయన ఇంట్లోకి కావలసిన ఎక్కువ కాలం ఉన్నా పాడయిపోని వస్తువులు ఒక్కసారే కొనేసి స్టోరులో పడేస్తాడు. ఏది అయిపోయినా తాళం తెరచి ఇస్తూంటాడు.

ఎనిమిది గంటలయింది. కొట్టు తీయటానికి వెళ్ళబోతూ సత్యం తండ్రి దగ్గరి కొచ్చి "అయితే షేర్లు అక్కరలేదని చెప్పేస్తాను" అన్నాడు.

"ఊ" అన్నాడు సూర్యారావు.

"ఇంకొకసారి ఆలోచించి చూడండి నాన్నా. ఆషేర్లు కొంటే మంచి లాభం..."

"అటువంటివి మనకొద్దులేరా, వద్దని చెప్పు." సత్యం వెళ్లిపోయాడు.

తొమ్మిదిన్నరయింది. ఆఫీసుకు వెళ్ళబోతూ గోపాలం సూర్యారావుదగ్గరికొచ్చి

"నాన్నా ఓ అయిదు రూపాయలు ఇవ్వు" అన్నాడు.

"అదేమిట్రా కర్చుకోసం అట్టే పెట్టుకొన్న పది రూపాయలు అయిపోయినయ్యా. ఇంత దుబారాగా ఖర్చు పెడితే ఇక అయినట్టే! జాగ్రత్తగా ఖర్చు పెట్టటం నేర్చుకో వరూ? ఇదిగో ఈ రెండూ ఉన్నయ్ తీసికెళ్ళు".

గోపాలం రెండు రూపాయలు తీసి కెళ్ళాడు. ప్రతి నెలా జీతం రాగానే, సూర్యారావు అతడి నెలసరి ఖర్చుకు పది రూపాయలు పోను మిగిలిందంతా తీసుకొంటాడు.........

సాయంత్రం అయింది. ఎప్పటిలాగానే రంగనాథం, సూర్యారావు షికారుగా వెళ్ళి సముద్రపు తీరాన కూర్చున్నారు. రంగనాథం "అంతా ఏర్పాటు చేసుకొన్నాను సూర్యం. యివ్వాళ ఏడో తారీఖుకదూ? పన్నెండో తారీకు రాత్రి బయలుదేరి నాగపూర్ వెడుతున్నాను. పదకొండు రాత్రికి మా చెల్లెలును తీర్థయాత్రలకు పంపుతున్నాను" అన్నాడు.

"అదేమిటి రంగనాథం! అంత ముంచుకుపోయిందేముంది ఇప్పుడు? నీ తరహా చూస్తే సరదాగా ఏదో ఆట ఆడుతున్నట్టుగా ఉంది" అన్నాడు సూర్యారావు ఆశ్చర్యంతో.

"ముంచుకుపోవటానికి ఇందులో ఏముంది? ఎటూ నిన్న మనం అనుకొన్నది చెయ్యాలనే నిశ్చయించుకొన్నాను. ఆ ప్రకారం చేయాలంటే నాగపూర్‌లో పధ్నాలుగో తారీకు ఛార్జీ తీసుకోవాలి. అందుకనే ఈ ఏర్పాటంతా.. .. నేను నాగపూర్‌లో ఒక్క నెలకంటే ఎక్కువ ఉండననీ, అందుచేత సంసారం అంతా కదల్చటం ఎందుకు నేనొక్కడినే వెడతానని మా సుపుత్రులకు నచ్చచెప్పాను. కాకపోతే నా అంచనా ప్రకారం ఆరు నెలలయినా వీళ్ళను ఇట్లా వదలి పెడితేకాని వీళ్లు బాగుపడరు. పన్నెండో తారీకేగదూ ప్రయాణం? ఈ వేళ నీతో చాలా సంగతులు మాట్లాడాలి......"

## 2

పన్నెండో తారీకు వచ్చింది. రంగనాథం వెళుతున్నాడని రాత్రి సూర్యారావు తొందరగా భోజనం చేసి ఇంట్లో చెప్పి స్టేషనుకు బయలుదేరాడు. ఆయన స్టేషనుకు వెళ్లేటప్పటికే, రంగనాథం, ఆయన ఇద్దరు కొడుకులూ రామారావూ, సీతాపతీ వచ్చి స్టేషనులో తయారుగా ఉన్నారు. సూర్యారావు స్నేహితుని కొడుకుల్ని చూసి "ఏమోయ్ కులాసా?" అని పలుకరించాడు.

"ఆ" అన్నారు ఇద్దరూ, అయితే ఎవరి ముఖంలో సంతోషం లేనేలేదు.

నలుగురు కాసేపు మాట్లాడుకొన్న తరువాత సూర్యారావును పక్కకు తీసుకువెళ్ళి రంగనాథం "నేను చెప్పిన పాయింట్లు అన్నీ గుర్తున్నయ్‌కదూ? నేను ఎందుకు వెడుతున్నానో, ఎంత కష్టంగా వెడుతున్నానో గుర్తుంచుకో...వాళ్లు డబ్బు అడిగితే ఇవ్వకు. వాళ్లు బాగుపడటానికి అవసరమయిన పనికి ఖర్చు పెట్టాలంటే మటుకు ఇవ్వు. ఎంత ఇచ్చావో నాకు రాస్తే నేను నోటురాసి పంపిస్తాను. అంతేకాని వాళ్లు జాలిగా అడిగితే నువ్వు అప్పు ఇవ్వకు. వాళ్ళకు ధైర్యం కోసం ఏదయినా అవసరంవస్తే నిన్ను అడగమని చెప్పాను. అంతే. నేను చెప్పినవి గుర్తున్నయ్‌కదూ. కొంచెం వాళ్ళను కనిపెట్టుకొని ఉండు. అదిగో బండివచ్చింది" అన్నాడు.

బండివచ్చింది. ఇక రెండు నిమిషాలకు బయలుదేరుతుందనగా రంగనాథం ఎక్కి కొడుకులతో "జాగ్రత్తరా ఒక్క నెలలో జాలేగా. ఇల్లు జాగ్రత్త. ఖర్చుకు డబ్బు పంపిస్తాను. ఇంట్లోకి కావలసినవి కొనండి. వేళకు ఇంటికి వెడుతూండండి. కోడలినిమటుకు ఇబ్బంది పెట్టకండి. అంతగా ఏదయినా అవసరంవస్తే సూర్యారావును సహాయం అడగండి. తెలిసిందా" అన్నాడు. ఆయన గొంతు కొంచెం గాద్గదికంగా తయారైంది..

"అట్లాగే లేనాన్నా. నువ్వుమటుకు నెల తిరిగేసరికి వచ్చెయ్యాలి తప్పకుండా" అన్నాడు రామారావు. అతడి గొంతు బొంగురుపోయింది. కళ్ళనీళ్ళు బలవంతంగా ఆపుకొంటున్నాడు. సీతాపతీ అంతే.

"తప్పకుండా వచ్చేస్తానుకదూ."

బండి కదిలింది. "సూర్యం వెళ్లొస్తారా. రామూ, సీత వెళ్ళివస్తాను. జాగ్రత్త" రంగనాథం పెట్టె లోపలికెడుతూ ఉత్తరీయంతో కళ్లు తుడుచుకొన్నాడు.

రామారావు, సీతాపతి ఇద్దరు ఇంటికి వెళ్ళాక, సూర్యారావు, ఇంటికివస్తున్నాడు. అప్పుడు రాత్రి తొమ్మిదిన్నర, అయిఉంటుంది. సూర్యారావు ఇల్లు గోడు మీదికే ఉంటుంది. ప్రహరీగోడకూడలేదు. మా దేశ్ళక్రితం చవకగా వస్తోందని కొనేశాడు. సూర్యారావు ఇంటికి వచ్చి పరధ్యాన్నంగా వరండాలోకొచ్చి సరాసరి తలుపు తట్టబోయి చటుక్కున ఆగాడు. ఎడమపక్క గదిలోంచి ఏవో మాటలు మెల్లిగా వినపడుతున్నయ్. ఆ గది ఎవరూ ఉపయోగించుకోరు. ఎవరిగదులు వాళ్ళకున్నయ్. ఇప్పుడు అందులోంచి మాటలు ఏమిటా అని సూర్యారావు మెల్లిగా తలుపు దగ్గరికెళ్ళి నుంచున్నాడు. లోపల పెద్దకొడుకు సత్యం, రెండోకొడుకు గోపాలం మాట్లాడుకోవటం విన్పించింది.

".. నువ్వుచెప్పింది అక్షరాలా నిజమే అన్నాయ్. నాన్నకు ముసలితనం పైబడ్డ కొద్దీ చాదస్తం ఎక్కువౌతోంది. ప్రతిదానికీ వంకలు పెట్టడమే. ప్రతిదీ కాదనటమే." సూర్యారావు నిర్ఘాంతపోయాడు. తనగోపాలమేనా ఇట్లా అంటోంది?...

"ఏంచేస్తాం గోపీ? పెద్దవాడు అని ఆయన చెప్పేదానికల్లా "ఊ" కొట్టడమే. మనం ఎంత

చెప్పినా వినిపించుకోడు కదా? తానుపట్టిన కుందేటికి మూడేకాళ్ళంటాడు" అన్నాడు సత్యం.

"రోజురోజుకు ఈయన ఛాదస్తం ఎక్కువౌతోందేకాని తగ్గటంలేదు. మొన్న మటుకు మొన్న ఎటువంటి ఛాన్సు తప్పిపోయింది? రెండువేలు డిపాజిట్టు కట్టిఉంటే నిక్షేపం లాంటి అయిదొందల ఉద్యోగం వచ్చి ఉండేది. డిపాజిట్టు కట్టడమే గాని ఆ డబ్బు మళ్ళీ మనకు ఎప్పటికయినా తిరిగొచ్చేదే గాని? ససేమిరా ఇవ్వనన్నాడు..."

"నాకూ అంతేగా? ఆ షేర్లు తీసుకొంటే ఎంతబాగుండేది? ఎన్ని విధాల చెప్పాను. ఊహుఁ! ఆయన బుర్రలోకి ఎక్కితేగా? పైగా గట్టిగా అడిగితే కోపం. నోటికొచ్చినట్టు అంటాడు......"

"వీళ్ళు పెరిగారే, వీళ్ళమాట కొంచెం విందామనే ఆలోచనే లేదు. ఛీ! ఛీ! రోజురోజుకూ మనిషంటే విసిగెత్తిపోతూంటే.."

సూర్యారావుకు వళ్ళు తెలియనంత కోపం వచ్చింది. వీళ్ళు తన కొడుకులేనా? ఆ మాట్లాడేదంతా తననుగురించేనా? ఛీ!-ఛీ! ఎంతనీచులు! తలుపును ఒక్క తన్ను తన్ని ఇద్దరిని జుట్టుపట్టుకొని బయటికీడ్చి ఇంట్లోంచి వెళ్ళగొడదామన్నంత కోపం వచ్చింది. ఆ కోపంలో అంతపనీ చేసేవాడే. ఇంతలో వసారా తలుపులు తెరుచుకొని సత్యవతి బయటికొచ్చింది. తలుపులు తెరుచుకోవటం చూసి సూర్యారావు చటుక్కున ఇటు వచ్చేశాడు.

సత్యవతి భర్తను చూసి "ఇంతసేపయిందేమండీ? ఇంకా రాలేదని గాభరా పడుతున్నాను" అంది.

సూర్యారావు "ఇదుగో ఇప్పుడే బండి వెళ్ళిందా? ఇటు వస్తున్నాను" అన్నాడు నీరసంగా...

ఇంతలో పక్కగది తలుపులు తెరుచుకొని సత్యం, గోపాలం వచ్చారు.

"అదేమిటి నాన్నా, ఇంతఆలస్యం అయింది ఎందుకని? బండి లేటా?" అన్నాడు సత్యం...

"బండి వెళ్ళిపోగానే ఏ రిక్షాలో నేనా రాకపోయ్యారా" అన్నాడు గోపాలం.

సూర్యారావు కొడుకులను అసహ్యంతో ఒకసారి చూసి ఎవరికీ ఏమీ చెప్పకుండా లోపలికి వెళ్ళాడు.

ఆరాత్రి సూర్యారావుకు నిద్రపట్టలేదు. మనోహరమయిన తోటను పెనుతుఫాను నాశనం చేసినట్టుగా ఆయన మనస్సు అల్లకల్లోలమయింది. తనకొడుకులు—సత్యం, గోపాలం-ఇంత ఛండాలురా? తనమీద వాళ్ళకుగల అసలు ఉద్దేశ్యాలు ఇవేనా?... అసలు ఈ ఇంటిలో వీళ్ళెవ్వరేనా? అందరూ ఇంతేనా?...ఏమో ఎవరుమాశారు? తన వెనకాల ఎవరెన్ని పన్నాగాలు, తనమీద ఎంతెంత నీచంగా చర్చించుకొంటున్నారో?...ఛీ! తనదగ్గర ఎంత నమ్రతగా ఉంటున్నారో?...' చివరికి వీళ్ళనిజస్వరూపాలు ఇవేనా? నా పరోక్షంలో వీళ్ళు ఆడే నాటకాలు పసికట్టటం ఎలా? ఏంచేసే తెలుసుంది?' ఆయన మెదడు అల్లకల్లోలమయిపోయింది...అర్ధరాత్రిదాటాక సూర్యారావు ఏదో నిశ్చయానికొచ్చి అల్లాగే నిద్రపోయాడు.

తెల్లవారింది. సూర్యారావు ఇంటిలో అందరూ లేచారు. సూర్యారావు ముఖంకడుక్కోవటం అయిపోయినా బావిదగ్గరే నిల్చుని ఏదో ఆలోచిస్తున్నాడు. సత్యవతి భర్త పరధ్యాన్నంచూసి కొంచెం ఆశ్చర్యపడ్డది. రోజూ తెల్లవారుఝామున లేచింది మొదలు ఎనిమిదిగంటలకు పూజఅయ్యేవరకు యంత్రంలాగా చకచకా అన్నిపనులు చేసుకొనే వాడు. ఈ వేళ ఎందుకింత ఆలోచిస్తూ కాలక్షేపం చేస్తున్నాడో ఆవిడకు అర్థంకాలేదు. ఆమె ఈయనదగ్గరి కొచ్చి "ఈ వేళ ఏమిటి ఆలోచిస్తున్నారు? స్నానంచేయరాదూ?" అన్నది.

సూర్యారావు ఉలిక్కిపడి "ఏం? ఎందుకు చేయను" అంటూ ఇంట్లోకి వెళ్లాడు. ఆయన తువ్వాలు చుట్టుకొని ఇరవై నిమిషాలయినా రాకపోయేసరికి సత్యవతి ఇంకా ఆశ్చర్యపోయింది. కోడలిని పిలిచి కుంపటి విసరమని చేతిలోఉన్న విసినికర్రఇచ్చి తాను భర్తగది లోకివెళ్లింది. అక్కడ సూర్యారావు తువ్వాలుచుట్టుకొని కుర్చీలో కూర్చుని ఏదో దీర్ఘాలోచనలో పడిఉన్నాడు.

"అదేమిటండీ ఈ వేళ ఏదో కొత్తగా ఉందేమిటి మీతరహా? ఏమిటంతఆలోచన?" అని అడిగింది సత్యవతి.

సూర్యారావు కొంచెం కంగారుతో "ఏమీలేదు పద" అని స్నానానికి బయలుదేరాడు.

"ఏమిటో చెప్పండి. నాకు చెప్పటానికేం?"

"ఏమీలేదని చెప్పలేదూ?" అని సూర్యారావు చకచకా బావిదగ్గరకు వెళ్ళాడు. ఎంతచలిలోనయినా ఆయనకు చన్నీళ్ళ స్నానమే అలవాటు.

సత్యవతి, రెండోకోడలు లలిత కాఫీలకు కాస్తున్నారు. పెద్దకోడలు సుందరి దొడ్లో పాలుపితుకుతోంది. ఇంతలో బావి దగ్గర "ధన్" మని పెద్ద చప్పుడవడంతో సత్యవతి, లలిత కంగారుగా దొడ్లో కొచ్చారు. సుందరి పాలచెంబు నేలమీద పడేసి "అత్తయ్యా మామయ్య జారిపడ్డారు" అని అరిచి బావిదగ్గరకు పరుగెత్తింది. అప్పుడే పెరట్లోకి వచ్చిన సత్యం, మొహం కడుక్కొంటున్న గోపాలం మురళి అందరు బావిదగ్గరకు పరుగెత్తారు.

సూర్యారావు జారిపడటంతో స్పృహ తప్పింది. "అయ్యోయ్యో యిదేమిటండీ" అంటూ సత్యవతి భర్తను ఏడుస్తూ, అటూ ఇటూ కదిపింది. సూర్యారావు కళ్ళు తెరవలేదు.

"నాన్నా, నాన్నా" అంటూ కొడుకులు తండ్రిని కదిపారు.

సత్యవతి "అయ్యో, ఇదేం ఖర్మమండీ? పొద్దుటేనుంచీ ఆ పరధ్యాన్నం ఏమిటో? ఇప్పుడీ విపరీతం ఏమిటో?" అని పెద్దపెట్టున ఏడుపు మొదలు పెట్టింది. ఆవిడతోపాటుగా మిగిలిన ఇద్దరు ఆడవాళ్ళు ఏడుపు సాగించారు.

సత్యం "మీరు కొంచెం నోరుమూసుకొని మెదలకుండా ఉండండే" అంటూ వాళ్ళను కసురుకొని తండ్రి ముఖంమీద చన్నీళ్ళు చల్లాడు. సూర్యారావు కొంచెం అటూ ఇటూ కదిలాడు.

"గోపీ, మురళీ, నాన్నను ఇంట్లో పడుకోబెడదాం" అంటూ సత్యం మిగతా ఇద్దరి సహాయంతో సూర్యారావును ఇంట్లోకి చేర్చాడు. "జారి పడటంవల్ల కొంచెం స్పృహ తప్పింది. గోపీ నువ్వువెళ్లి డాక్టరు వెంకటనారాయణగారిని పిలుచుకు రా" అన్నాడు.

పదినిమిషాలయిన తరువాత సూర్యారావు కదిలాడు, కళ్ళు తెరిచాడు.

"ఏమండీ, ఏమైంది? ఎట్లావుంది?" అన్నది సత్యవతి ఆదుర్దాతో. కోడళ్ళు ఆదుర్దాతో చూస్తున్నారు.

"నాన్నా ఎట్లా ఉంది?" అన్నాడు సత్యం.

మురళి కూడ ప్రశ్నించబోయాడు. ఇంతలో సూర్యారావు అందరివంకా

## నాటిక ఫలితాలు

"మీకు హిందీ వచ్చునాండీ?"

"నహీ."

* * *

"మీ పేరేమిటండీ?"

"మా తాతగారి పేరేనండి."

పోతుకూచి యజ్ఞేశ్వరశాస్త్రి
(నల్లగొండ)

గాభరాగా చూస్తూ "ఏమిట్రా అంటున్నారు? నాకేమీ వినపడటం లేదే?" అన్నాడు.

అందరికీ ఒకసారిగా షాక్ తిన్నట్లయింది.

"అదేమిటండీ వినపడటంలేదూ?"

"అదేమిటి నాన్నా..."

"సత్యం ఇదేం ప్రారబ్ధంరా బాబూ..."

"నాన్నా ఇదేమిటి?"

"ఏమిటి అంటున్నారు? నాకేమీ వినబడటం లేదే?" అన్నాడు సూర్యారావు ఖంగారుగా.

"ఇదెక్కడి ప్రారబ్ధమండీ. పొద్దున్నే లేచి ఎవరిమొహం చూశామో? అయ్యో ఇదెక్కడి విపరీతం?" అంటూ సత్యవతి కళ్లు తుడుచుకొన్నది.

ఇంతలో గోపాలం డాక్టరును తీసుకొచ్చాడు. సత్యం డాక్టరుగారితో "చూడండి డాక్టరుగారూ ఎంత ఘోరం జరిగిపోయిందో. కాలుజారిపడ్డారు, స్పృహ తప్పింది. చెముడుకూడా వచ్చినట్లుంది" అన్నాడు.

గోపాలం నిశ్చేష్టుడయ్యాడు "నాన్నకు చెముడొచ్చిందా?" అన్నాడు.

జరిగిపోయిన దురదృష్టకర సంఘటనను గురించి ఎవరైనా ప్రస్తావిస్తే ఆడవాళ్ళకు క్షణంలో పిలిచినట్లుగా దుఃఖం పొంగుకొస్తుంది. గోపాలం మళ్లీ ఈమాట అనగానే సత్యవతి పెద్దగా ఏడుస్తూ "అవునురా బాబూ! ఎంత ప్రారబ్ధంరా" అన్నది.

డాక్టరుగారు సూర్యారావును పరీక్ష చేశాడు. "అలా జారిపడటంవల్ల బహుశా గూబకు దెబ్బతగిలి ఉంటుంది. ఆసుపత్రికి తీసుకురండి. వివరంగా పరీక్షచేసి ట్రీట్‌మెంటు ఇస్తాను" అని విజిటింగ్ ఫీజు తీసుకొని వెళ్లాడు.

ఇంట్లో ఎవరిముఖంలోనూ కళలేదు. ఎవరూ ఏపనీ చేయకుండా నిస్పృహతో ఉన్నారు. సూర్యారావు ముందుగదిలో పడుకొన్నాడు. సత్యం తండ్రిని ఆసుపత్రికి తీసుకువెళ్ళటానికొచ్చాడు. అతను సూర్యారావు చెవిదగ్గర గట్టిగా "నాన్నా, డాక్టరుగారు చెవి పరీక్షచేయించుకోడానికి ఆసుపత్రికి రమ్మన్నారు. బయలుదేరు" అన్నాడు.

"ఆయనదగ్గరకు మళ్లీ వెళ్ళటం ఎందుకురా? డబ్బు దండుగ. గవర్నమెంటు ఆసుపత్రికి వెడితే సరిపోతుంది" అన్నాడు సూర్యారావు.

ఇంతలో సత్యవతి భర్తదగ్గరకు వచ్చి ఆయన చెవిదగ్గరకు వంగి "ఆయన ఆస్పత్రికే వెళ్ళరండి. డబ్బుకేమిటి? గవర్నమెంటు ఆసుపత్రులలో సరిగా పరీక్ష చేయరుటగా?" అన్నది.

"నీకు తెలియదు, నువ్వూరుకో. అసలు సత్యం పనిమానుకొని నాతో రావటం ఎందుకు? మురళి వస్తాడులే" అన్నాడు సూర్యారావు.

"అది కాదండీ"......

సూర్యారావు కొంచెం విసుగుతో ఆమె మాట మధ్యలోనే "మురళిని పంపించమని చెప్పానా? సత్యంవస్తే దుకాణంగతి ఏమిటి?" అన్నాడు కోపంగా.

"అమ్మా, ఆయనచెప్పినట్టే జరగనియ్యి. ఇంకోళ్లు చెబితే వినిపించుకొనే పద్ధతి ఆయనకు ఎప్పుడూ లేదుగా" అన్నాడు గోపాలం.

తండ్రితో మురళి ఒక్కడే హాస్పిటలుకు బయలుదేరాడు. కాని అరగంటలోనే తిరిగొచ్చాడు. సత్యవతి కొంచెం గాభరాతో "ఏరా ఏమిటి? ఏమయింది? ఒక్కడివే తిరిగొచ్చావేం? నాన్నగారేరీ?" అని అడిగింది.

"ఏమీలేదే. నాన్న కళ్ళజోడు మరిచిపొయ్యారుట. తీసుకురమ్మని పంపారు. ఇంకా పరీక్ష జరగలేదు" అంటూ కళ్ళజోడు తీసుకెళ్ళాడు మురళి.

రెండు గంటల తరువాత సూర్యారావు మురళి ఇంటికివచ్చారు. సత్యవతి ఆత్రుతగా కొడుకును "ఏరా ఏమయింది? డాక్టరు ఏమన్నాడు" అని అడిగింది.

"ఇందాకా కళ్ళజోడు తీసికెళ్ళేసరికే పరీక్ష అయిపోయిందట. మెడ్రాస్ నుంచి 'హియరింగ్ ఎయిడ్' తెప్పించుకోమని డాక్టరు చెప్పారని నాన్న చెప్పాడు" అన్నాడు మురళి.

ఆ మధ్యాహ్నం భోజనాలయిన తరువాత సత్యవతి సూర్యారావు దగ్గరికొచ్చి, ఆయన చెవిదగ్గరకు వంగి గట్టిగా "ఏమండీ, ఆ డాక్టరు చెప్పినవేవో కొనుక్కోరాదూ?" అన్నది.

సూర్యారావు "అవి ఎంతవుతాయో నీకేమయినా తెలుసా? అయినోండలు! అంత డబ్బు తగలెయ్యటం ఎందుకే? హోమియోపతిలో ఇటువంటివాటికి ఫస్టుక్లాసు మందులుంటయ్. అవే వాడితే సరి" అన్నాడు.

ఆరాత్రి భోజనాలదగ్గర సూర్యారావు చెవుడు ప్రసంగమే వచ్చింది. సత్యం తల్లితో "ఆ 'హియరింగ్ ఎయిడ్' ఈయన ఎందుకు కొంటాడే? డబ్బు ఖర్చుపెట్టవద్దూ? ఈయన సంగతి మనకు తెలియనిదేముంది?" అన్నాడు పరిహాసంగా.

అన్నయ్యామాటలకు గోపాలం కొద్దిగా నవ్వి "బాగా చెప్పావురా. ఇబ్బందులుపడ్డాసరే ఆయన డబ్బు ఖర్చుపెట్టటానికి లక్షసార్లు ఆలోచిస్తాడు. ఏం చేస్తాం? ఆయన తత్వం అంతే" అన్నాడు.

సూర్యారావు అన్నంతింటూ తలెత్తాడు. ఆయనకు కొడుకుల మాటలు వింటూంటే వళ్ళు తెలియని కోపం వచ్చింది. ఆ క్షణంలో, తాను ఇప్పుడు కావాలనే, వీళ్ళ నిజస్వరూపాలు తెలుసుకోవాలని చెవిటివాడిగా నటిస్తున్నానని గుర్తుకు రాకపోయినట్లయితే అక్కడో చిన్న సైజు యుద్ధకాండ జరిగిఉండేదే. ఆయన చూపుల్లో, కళ్ళలో, ముఖంలో ప్రత్యక్షంగా కనిపిస్తున్న కోపం మటుకు ఎవరూ చూడలేదు...

(ఇంకా ఉంది)



# మహిళాలోకం

## 'ఇరుగు పొరుగులు' - అంతే ఎంతవరకు?

'ఇరుగు పొరుగు అన్న తరువాత మాత్రం యిచ్చి పుచ్చుకోవడం లేకపోతే ఎలా అమ్మాయ్' నువ్వెప్పుడూ నన్ను యేసరుకూ అడగవు. నేనే నిన్ను అడుగుతూ వుంటాను. పాపం లేదనకుండా యిస్తూ వుంటావు. ఈ రోజుల్లో నీలాంటి మంచివాళ్లు ఉండడం అరుదు—' అంది మా పక్కయింటి శకుంతలమ్మగారు.

ఆమె మాటల్లో నిజమెంతో అబద్ధమెంతో నేనయితే విప్పిచెప్పలేను. కావాలంటే ఒక్కొక్క వాక్యాన్ని గురించీ నా అభిప్రాయం యేమిటో చెబుతాను. 'ఇరుగు పొరుగులు అన్న తరువాత ఇచ్చి పుచ్చుకోవడం' అనేది ప్రాసకోసంఅయితే బాగానే వుంటుందేమో గాని, నిత్య జీవితంలో యిలాంటి లావాదేవీలు ఎన్నో కలహాలకు, నష్టాలకు దారితీయడం మనం అన్ని యిళ్లల్లోనూ చూస్తూనే వుంటాం. అసలు యిచ్చి పుచ్చుకోవటాలంటే నాకు చిన్నప్పటినుంచి సరిపడవు. పొద్దస్తమానం 'కాస్త కాఫీపొడి ఉంటే యిస్తారా?' 'కాస్త అగ్గిపెట్టె యిప్పించండి.' 'కాస్త మీ కలం యివ్వండి' 'కాస్త మీ వారపత్రిక ఓమారు యిస్తారూ?' ...యిలాంటి మాటలు వింటున్నప్పుడు నా శరీరం మీద తేళ్లు, జెర్రులు పాకుతున్నట్లు వుంటుంది. ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తున్నప్పుడల్లా నాకో చిన్నకథ జ్ఞాపకం వస్తూ వుంటుంది. ఒకసారి పోస్టాఫీసులో యిద్దరికిమధ్య యిలా సంభాషణ జరిగిందట. వాళ్లిద్దరూ అంతకుముందు ఒకర్ని ఒకరు ఎరగరు.

'ఏమండీ. కాస్త కలం యిప్పించండి—'

అవతలి మనిషి యిప్పించాడు.

'కళ్లజోడు మరిచిపోయాను. మీరే రాసిపెట్టండి—'

కలం జేబులోంచి పైకి తీశాడు గనక, కాయనని అనలేకపోయాడు అవతలి మనిషి.

'సారీ! మనియార్డరు ఫారం అందుకోవడం మరిచేపోయా! కాస్త కౌంటర్లో ఓ ఫారం అందుకుందురూ!'

అవతలి మనిషికి చిర్రెత్తుకొచ్చింది. కాని శాంతిస్వభావుడని పేరు తెచ్చుకుందామని అభిలాషచే, ఆ కాస్తపనీ చేసిపెట్టాడు.

గొప్ప ప్రయత్నం మీద మనియార్డరు ఫారం పూర్తిచేయడం అయింది.

'ఏమండోయ్, మనీపర్సు వేసుకురావడం మర్చిపోయాను. కాస్త యీ పది రూపాయిలూ మీరే యిప్పించండి. యింటికి వెళ్లాక వెంటనే యిచ్చేస్తాను—' అన్నాడు మొదటి

ఎన్. సి. అరుంధతి

మనిషి. మళ్లీ గుర్తుచేస్తున్నాను. ఇద్దరూ ఒకర్నొకరు ఎరగరు. అవతలిమనిషి యేంచేశాడో వేరే చెప్పాలా? మనియార్డరుఫారం ఆసామీ ముఖంముందే చింపేసి, శాపనార్థాలు పెడ్తూ ఇవతలికి వెళ్లిపోయివచ్చేశాడు. మరీ కాస్త మెతకమనిషి అయిపోతే, ఆ పదిరూపాయలు కూడా సమర్పించుకుని వచ్చేవాడేమో!— ఇంతకూ చెప్పవచ్చింది యేమిటంటే కాస్త కాస్త అంటూ ఇవ్వడం మొదలెడితే దానికి అంతంటూ ఉండదు.

మా పక్కింటి శకుంతలమ్మగారు చెప్పే ధోరణిలో ఇంట్లో కావాల్సిన వస్తువుల్లో యేదో ఒకటి రోజూ ఎరువు తీసుకోకపోతే ఆరోజు భోజనం చేసినట్లేవుండదు, అసలు వంట చేసుకున్నట్లేవుండదు.

'అయ్యో, నామతిమండ! కారం అయిపోయిందని మనసులో అనుకుంటూనే ఉన్నాను. ఆయనతో చెబుదామంటే, యేదీ, ఒక్కక్షణంతీరిగ్గావుంటేనా? అబ్బాయేమో బడికివెళ్లాడు. ఒంటిగంటయితేగాని రాడు. ఎట్లా చచ్చేదమ్మా యీ కాపురంతో—' ఆమె అడిగిపుచ్చుకోవడంలో సున్నితమైన పద్ధతి ఇదొకటి.

విచిత్రమైనవిషయం యేమిటంటే, ఆమె మీదగ్గరికివచ్చి యేవస్తువయినా అప్పుఅడిగిందంటే, ఎప్పుడూ సూ గా, నిక్కచ్చిగా అడగదు. ఆ వస్తువు తనకు కావాలి, మనం ఇవ్వాలి—అనే రెండువిషయాలూ స్పష్టంగా అర్థం ఆయ్యేట్లు మాట్లాడుతుంది. అనుభవం వున్న యిల్లాలు, ఇంతకంటే ఇంకేంచేస్తుందిలెండి. ఆమె మాటలకు మనం యిస్తాం. తప్పదు. ఆమె మనను అప్పుగా అడిగితీసుకోడంగానీ, ఫలానా అప్పుడు తిరిగి యిస్తానని అనడంగానీ జరగలేదు గనుక ఆమెగారు ఇవ్వవలసిన వస్తువులు జాబితా రాసుకుని కూడా ప్రయోజనం లేదు. పరలోకంలో మన పుణ్యాన్ని అంచనావేయడం కోసరం ఇది పనికివస్తుందేమోగానీ యీ లోకంలో దీని ప్రయోజనమటుకు సున్న. పరలోకంలోకూడా ఇదంతా అపాత్రదానంకింద జమగడితే మనకు మిగిలేది చివరంటాకున్నాయే!

సరే. ఆ విషయం అలా ఉంచండి.

అడిగినప్పుడల్లా ఇస్తూవుంటాంగనుక, ఆవిడగారికి మనమీద ఒకవిధమైన హక్కుకూడా యేర్పడుతూవుంటుంది. ఈ హక్కును ఆమె వినియోగించుకుంటూవుంటే, కాదనటానికి మన మెవరంగనుక? ఆమె మంచిగా మర్యాదగా మాట్లాడుతుందిగనుక ఆమె యే సమయంలో యే వస్తువు అడిగినా మనం కాదనలేం. ఒకవేళ అది మన ఇంట్లో రెడీగా లేకపోయినా వెంటనే బజారుకు పంపించి తెప్పించి యిస్తాం. ఇదంతా మీరు మంచీ మర్యాద అని అనిపించుకోవాలనుకుంటే జరిగేవిషయమేసుమండీ! కొన్నాళ్లు కాస్త కాస్తలకు అలవాటుపడిన తర్వాత మనకయినా తటిమని లేదనటానికి కుదరదు. నిక్కచ్చిగా ఉండదలచుకున్నదేదో మొదటనే ఉండాలి. ఇలాంటి విషయాలలో తరువాత చూద్దాం, కాస్త నిదానించి ఆలోచిద్దాం—అనే భ్రమలు పెట్టుకుంటే ఎందుకూ పనికి

## ఎప్పుడూ ఇంతే—48 శంకర్



రావు. "అది నిష్ఠూరం మేలంటారు" అందుకనే. 'ఇదివరకల్లా యేమడిగితే అది, అడిగిందే తడవుగా ఇచ్చేదానివి. ఇప్పుడేమో యేమడిగినా నోరు బిగించుకుని చేతులు కట్టేసుకుని కూర్చుంటున్నావు. అంటే ఎవరో నామీద నీకు చాడీలు చెప్పివుంటారు. వాళ్ల మాటలు వినే నువ్వు నాతో విరోధంగా ఉండాలనుకుంటున్నావు. పోనీలే. నీ కలా ఇష్టమో అలాగే వుండు. నిన్ను బలవంత పెట్టటానికి నేనేమన్నా నీ అత్తగార్నా? ఆడబిడ్డనా?' అంటూ ఆమెగారు దండకం ప్రారంభిస్తుంది. అప్పుడు మీకు మీ మన స్థితి ఎలా ఉంటుందో నేను వివరించి చెప్పనక్కర్లేదనుకుంటాను. కొబట్టి చివరకు మనకు అనిపించేదేమంటే యెవరితోగాని మంచిగా వుండాలంటే, వాళ్లు చెప్పిన పనులన్నీ మనం చేస్తూవుండాలి. వాళ్లు చెప్పినవిధంగానే చేస్తూవుండాలి. అంతేగాని మన యిష్టంవచ్చినట్లు వ్యవహరించటానికి వీల్లేదు. వాళ్ల అభిప్రాయాలకే ఊకొడుతూ వాళ్ల అడుగుజాడల్లో నడుస్తూ వాళ్లు కావాలనుకున్నదల్లా సమకూరుస్తూవుంటే మన అంతమంచివాళ్లు, మర్యాదస్తులూ యింక లేరు. అలా కాకపోయిందో, మనమంతా ఎందుకూ పనికిమాలినవాళ్లం నిరుపయోగమయినవాళ్లం. ఒకసారి అవతలవాళ్ల దృష్టిలో మనం యిలా అయిపోతే, అటుమీద మన పరిస్థితి యేమిటో ఈశ్వరుడికే తెలియాలి!

ఇరుగు పొరుగులు అంటే యేమిటో ఎంత సఖ్యంగా, ఎంత మెళుకువగా వుండాలో అందరూ ఉపన్యాసాలు యిస్తారుగాని ఎవరూ ఆదరించరు. ఒకవేళ ఆదరించే వాళ్లు ఎవరయినా వుంటే వాళ్లను ఎకసక్కెం చేస్తారు. అందరూ కలిసి అందంగా యేడిపించటానికి ప్రయత్నిస్తారు.

ఎవరి పరిస్థితుల్లో వాళ్లు హాయిగా సంతృప్తిగా జీవించటానికి వీల్లేకుండా యిరుగు పొరుగులని లేనిపోని పేర్లు పెట్టుకుని అనవసరమైన ఆడంబరాలు కలిపించుకుని తరువాత బాధపడుతూ వుంటారు.

అందరూ కలిసి హాయిగా వుండవచ్చు. అభ్యంతరం లేదు. ఎవరి ఆంతరంగిక విషయాలు వాళ్లు దాచుకుంటూ బయటకు సంబంధించినంతవరకూ ఎవరికీ యిబ్బందికలగకుండా కాలక్షేపం చేయగలిగితే గొప్ప యజ్ఞం చేసినంత ఫలం దక్కుతుం దనుకుంటాను! 'శాంతియుత సహజీవనం' అనేది యింకా మన ప్రాంతాల్లో యిరుగు పొరుగుల జీవనంలో ప్రత్యక్షంగా ఆచరణకు రావలసి వుంది. ఇంట గెలిచిగదా రచ్చ గెలవాలన్నారు. అంతర్దేశీయ సూత్రాన్ని ఆచరించటానికి ఉపన్యాసాలు యిచ్చేముందు మన సాంసారిక జీవితాలలో యీసూత్రాన్ని నూటికి నూరుపాళ్లూ అమలుచేసుకోవాలి.

★

# మన ధోరణులూ మనమూ!!

"ఏరా బాబుగా! నీ పెళ్ళానికేగాని మాకేం చీర లక్కర్లేదేరా! అవునులే, ముందొచ్చిన చెవులకన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడి అన్నారు మన పెద్దలు," అని వ్యంగ్యంగా దెప్పిపొడుస్తున్నది సుగుణక్క బాబన్నయ్యను. "ఏం అంతలేసి మాట లంటుంటే మీకేం పౌరుషం లేదా?" అన్నట్లు వదిన అన్నయ్యవంక రోషపూరిత నయనాలతో చురచుర చూస్తున్నది. ఎటూ మాట్లాడలేక, నీళ్లు మ్రింగుతూ, అన్నయ్య జాలి చూపులు చూస్తున్నాడు. ఇటువంటి సంఘటనలు ఏ ఒక్క చోటనో కాదు. ప్రతి ఇంట్లోను సర్వసహజంగా జరుగుతూనే వుంటవి. అసలు ఈ ఆడబిడ్డలనబడేవాళ్లు, తమ ఇంటికి వచ్చే అన్నయ్యల భార్యల్నో, తమ్ముళ్ళభార్యల్నో, తమ సొంత బానిసలనుకుంటారో ఏమో తెలియదుగాని, వాళ్ళ మీద ఎక్కడలేని హక్కులు తమకున్నట్లు భావించటంకద్దు. ఆ వచ్చినవాళ్లు మామూలుగా, అత్తవారిల్లు కొత్తకాబట్టి, ఒక నెలా రెండు నెలలు, అత్తగారికీ, ఆడబిడ్డలకు అణిగిమణిగి వుండి సర్దుకుపోతుంటారు. కాని అక్కే, ఏమాత్రం స్వాతిశయం వున్న వాళ్ళయినా అయితే, ఈ అర్థంపర్థంలేని ఆడబిడ్డల అథారిటీలకు చిరాకు పడటం సహజం. దాంతో ప్రారంభమవుతుంది గొడవ. అటు అత్తగారేమో, ఎంతయినా చూస్తూ, కూతుర్ని ఏమీ అనలేదుగదా. ఇంక ఈ ఆడబిడ్డగారి చలాయింపులకు, జారీ చేసే ఆర్డర్లకు అంతుండదు. ఒకవేళ ఏమన్నా తిరుగుబాటు ధోరణి కన్పించిందా, ఈ కేసు పవిత్రంగా, అన్నయ్య ముందో, తమ్ముళ్ల ముందో జడ్జిమెంటు కోసం, ఫైలు చెయ్యబడుతుంది. ఈ ఆడబిడ్డలబాధలు భరించలేక, ఏదో విధంగా భర్తలను పతాయించి వేరేకాపురం పెట్టేంతవరకు గట్టిగా ఊపిరయినా పీల్చుకోటానికి నోచుకోనివారనేకమంది.

పెళ్ళయి, వదినల్నో, మరదళ్ళో తమ ఇంటికివచ్చినతర్వాత అధికారం చలాయించేవాళ్ళు కొంతమందివుంటే, ఇంకా యేమీ లేందేనే, "అలూ లేదు, చూలూ లేదు. కొడుకుపేరు సోమలింగం" అన్నట్లుగా, పెళ్ళిచూపులలోనే ఆడబిడ్డఅధికారంగురించి ప్రస్తావన, వాళ్ళకు పెళ్ళిళ్ళలో నెరవేర్చవలసిన కోర్కెలకు సంబంధించిన ఖచ్చితమైన షరతులు చెప్పేవారుంటారు. ఒకమ్మాయివుంది. ఆఅమ్మాయి వాళ్ళన్నయ్య పెళ్ళికి తనకు ఆడబిడ్డ కట్నంగా వెయ్యిన్నూట పదహార్లు ఎవరు ఇవ్వగలరో, వాళ్ళు మాత్రమే, మా అన్నయ్యను పెళ్ళిచేసుకోటానికి అర్హులని ఒక నిబంధన పెట్టింది. అసలే పెళ్లికొడుకులకే కట్నాలు పొయ్యలేక చస్తున్న ఆడపిల్లల తండ్రులు, ఇటువంటి గొంతెమ్మ కోర్కెలన్నీ తీర్చటానికి

## బోయిన కనకదుర్గ

మరో జన్మ ఎత్తాల్సిందే. పైగా ఆ అబ్బాయికొచ్చే కట్నంలో కానీ తగ్గటానికి వీల్లేదు. ఇట్టు ఆడబిడ్డ కట్నము నయాపైసా తగ్గకూడదు. ఈ షరతుమూలంగా, ఆ అబ్బాయికొచ్చిన, ఎన్నో మంచి సంబంధాలు తిరిగిపోయినయి. చివరకు ఈ బాధపడలేక, ఆ అమ్మాయి అన్న తనకు నచ్చిన ఒక అమ్మాయిని గప్ చుప్ గా రిజిష్టరు మ్యారేజి చేసేసుకున్నాడు.

ఇంకో గడుగ్గాయి వున్నది. ఆ అమ్మాయి బంధుపరివారసమేతంగా కఱ్ఱలతో సహా చీటికీ మాటికీ, ప్రతి చిన్నవిషయానికి వాళ్ల వదినతో పోట్లాట పెట్టుకుని, ప్రత్యక్షయుద్ధకాండ ప్రదర్శించేది. ఆ అమ్మాయికి కోపం వచ్చిందంటే అసలే మనిషి కాదు. చిన్నప్పటినుంచి అల్లారు ముద్దుగా పెంచటం వల్ల ఆ అమ్మాయికి మంకుపట్టు బాగా పట్టుబడింది. తను ఎవరిచేతా వీసమెత్తుమాట పడదు. ఆత్మాభిమానం ఎక్కువ. కాని తనెన్నన్నా ఎదటివాళ్లు నోరుమూసుకుఊరుకోవాల్సిందే. పైగా ఆ అమ్మాయికి చిర్రెత్తుకొచ్చిందంటే, ఇటు నోటితోనూ, అటు చేతితోనూ కూడా ఆయుధాలు కురిపించగలదు. ఒకసారి, వాళ్ళవదిన ఏదో అన్నదని, కూర తరుగుతున్న కత్తిపీట తీసి మీద కసిరేసింది. వాళ్ల వదిన అదృష్టం, లేచిన వేళా విశేషం బాగా వుండబట్టి, ఆ కత్తిపీట భుజా తగిలి గాయమయిందేగాని, ఏ ఆయువుపట్టుదగ్గరో తగిలివుంటే, ప్రాణం పొయ్యేదే. ఈ సంగతి తెలిసి, ఆమె తల్లిదండ్రులు



# వనితావాణి



## మహిళలూ—

17-8-60 తారీఖున వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివాను. అందులో "వనితాలోకం" అనుశీర్షిక చెప్పుకోదగ్గటువంటిది. "మహిళలు-ఉద్యోగాలు" అను నామముతో డి. సీతా హైమవతిగారు చక్కగా విమర్శించాగా నా అనుభవములో కూడా ఆమె వర్ణించిన క్లిష్టపరిస్థితులను స్వయముగా చూడగలిగాను. స్త్రీలు, పురుషులను ఎలా అర్థంచేసుకోవాలో, ప్రకృతి స్వభావసిద్ధంగా తమ కర్తవ్య మేమిటో తెలిసికొని, నా సహపాఠకులు మరియు యితర రచయిత్రీ అక్కగార్లు అనుసరించగలరని భావిస్తూ, యీ పత్రికద్వారా డి. సీతా హైమవతిగార్కి నా హృదయపూర్వక ధన్యవాదము లర్పింపగోరుచున్నాను.

కుమారి కె. వి. వరసమ్మ, అరక్కోణం.

* * *

గా॥ సంపాదకులకు, 'మహిళలు-ఉద్యోగాలు' చాల చక్కగా వ్రాసారు. డి. సీతా హైమవతిగారు కోటి స్త్రీలు చేసే అసమంజసమైన విమర్శలకు చక్కని సమాధానం ఇచ్చారు. వారికి మీ పత్రికద్వార నా ధన్యవాదములు తెలుపగోర్తాను. పత్రికలో రాజధానికబుర్లు లేకపోవటం చంద్రునిలోని మచ్చలాగ తీరనిలోటును కలుగజేస్తోంది. ఇకముందు ఆ మచ్చని తొలిగిస్తారని ఆశిస్తాను.

జి. సావిత్రిగారు మద్రాసు ఆంధ్రపత్రిక వీక్లీలో వ్యాయామము, ఆహారము గురించి వ్రాసారు. అవన్నీ (పాత పత్రికలు) పోయినయ్. దయచేసి పెరిగిన పొత్తికడుపు గురించి వ్యాయామము, ఆహారం, నిద్ర, నియమాలు మరోసారి వీక్లీలో వ్రాస్తారని ఆశిస్తున్నాము. (పొత్తికడుపు మామూలుగా ఉండేట్టు వ్యాయామం)

కె. సావిత్రి, కాకినాడ.

* * *

## సుగాత్రీయం

అతిగా అలంకరించుకుని అందంగా వున్నాననే అహంభావంగల అతివలకు అద్భుతంగా అవగాహనచేసుకునేలాగున అందించారు "సుగాత్రి"గారు తమ "అందం-అలంకారం" అన్న వ్యాసంలో. ఆడంబరాలకు పోయి అపహాస్యంపాలవడంకన్న కొద్దిలోనే నీటుగా వుండడం నేర్చుకోవడం అవసరం. వ్యాసం నిడివి కొద్ది ఎక్కువయినప్పటికీ చాలా చక్కగావుంది. అందము పేది ఒక్కొక్కరి ముఖంలో వుట్టిపడుతుంది. అది పుట్టుకతోనే వస్తుందేమో! మరికొందరికి ఎంత అలంకరించుకున్నప్పటికీన్నీ కళ అనేది కనిపించదు. అలంకారంకంటె నీట్‌నెస్ అనడం బాగుంటుందేమో!

సుశీలాకృష్ణ, విజయవాడ.

---

ప్రత్యక్షమయ్యారు. ఈ గొడవ సద్దుమణిగి, వాతావరణమంతా ప్రశాంతంగా తయారవటానికి చాలాకాలం పట్టింది.

ఇటు చిన్నవాళ్ళసంగతి ఇట్లా వుంటే, తమకు పెళ్ళిళ్లయి, అత్తవారిళ్ళకు కాపరాలకు వెళ్లి కూడా, తమ ఇంటి దగ్గర, తమ్ముళ్ళ భార్యలమీద పవరు చూపిదామనుకునే ఆడబిడ్డలు కూడా వున్నారంటే అతిశయోక్తి కాదు. ఒకామె వుంది. ఆమెకు పెళ్ళయి నలుగురైదుగురు పిల్లలుకూడా వున్నారు. కాని, ఆమె పుట్టింటికొచ్చి, వెళ్లే ప్రతిసారీ, "ఒరేయ్ తమ్ముడూ! అనవసరంగా డబ్బు ఖర్చు చేయకురా. చీరలూ, నగలూ, ఆడవాళ్ళకు ఎన్నివున్నా ఆశకు అంతుండదు. దాని కిప్పుడన్నా ఏ చీరో కొన్నావంటే నాకు జాబురాస్తుండు", అని వార్నింగు ఇచ్చి వెళ్తుంది. మళ్ళీ తిరిగి ఏ పండక్కో ఇంటికి వచ్చినపుడు మరదలు సామానంతా, చీరెలూ, సారెలతో సహా చెక్ చేసి, ఏదన్నా కొత్తచీరెలవీ కనబడితే, తమ్ముణ్ణి దుయ్యబట్టడం మొదలెపెడుతుంది. అందుకని, ఆవిడొస్తుందని తెలియగానే, రెండురోజులు ముందుగానే, అతను కొత్తచీరెలూ, నగలూ, అన్నీ ఓపెట్టెలో పెట్టి, అవి డెల్లేదాకా ఫ్రెండు ఇంట్లో సన్నా దాచేసుంటాడు. కాని ఎన్నాళ్లని ఇట్లు గడిచినా, ఈ అర్థంలేని అధికారాలను ఎవరుమాత్రం, భరించగలరు? అతనూ, అతని భార్యా సౌమ్యులు కాబట్టి, ఓపికతో ఎట్లాగోట్లా సర్దుకుపోతున్నారు. ఇంకొకళ్ళయితే బంధుత్వాలకు స్వస్తే గదా.

ఇంటి ఆడపిల్లలన్న తర్వాత, అన్నల మీదా, తమ్ముళ్ల మీదా, కొంతఅధికారాన్ని పొందివుండటం, తమ అచ్చటా, ముచ్చటా, తీర్చుకోవాలనుకోవటం సహజమే. దాన్ని వరూ కాదనలేరు. కాని దూరాలోచనలేక, హద్దూపద్దూ లేకుండా, ఆ హక్కును దుర్వినియోగం చేస్తే కొడిసికొట్టే ప్రమాదముంది. దేముడు వరమిచ్చినా, పూజారి వరమివ్వనట్లుగా, అత్తగారు మంచిదయి, వివిధమైన అరమరికలులేకుండా, సంసారం సాఫీగా సాగిపోయినప్పటికీ, కొన్నిచోట్ల ఈ ఆడబిడ్డల పోరు తప్పటంలేదు. ఆంగ్లంలో ఒక సామెత వున్నది. "ఎ సన్ యీజ్ ఎ సన్, అన్‌టిల్ హీ మారీస్, బట్ ఎ డాటర్ యీజ్ ఎ డాటర్ ఫర్ ఎవర్" అని. కొడుకన్నవాడు పెళ్లయ్యేంతవరకు మాత్రమే కొడుకు. కాని కూతురన్నది ఎప్పటికైనా కూతురేనని. నిజానికి, కూతుళ్ళకు పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళకు వెళ్ళినా, పుట్టింటికి రాకపోకలు సాగుతూనే వుంటవి. కాని కొడుకులకు పెళ్ళిళ్ళయితే పాత బాంధవ్యాల స్థానే కొత్త బంధాలు, మమతలు ఏర్పడుతవి. అది సర్వ సహజం. 'నా భార్య, నా సంసారం' అని మగవాడైనా, తన సంసారాన్ని గురించి తలపోస్తాడు. కాని అందుకు అడ్డుతగిలి, ప్రతి నిముషానికి, చెల్లెళ్లో, అక్కలో, 'నువ్వు నీ పెళ్లాన్నే చూసుకుంటున్నావు. మమ్మల్ని సరిగా చూడటంలేదు. పూర్తిగా వదిలేశావు", అని దెప్పిపొడుస్తుంటే, తద్వారా వాళ్లు తమ అచ్చట్లు, ముచ్చట్లు తీర్చుకోలేరుగదా, పైపెచ్చు, తమమీద వాళ్ళకేమాత్రం మమతలున్నా, అవి కూడా తెగిపోవటానికి ఆస్కారముంది. తమఇంటికి కొత్తకోడళ్ళు వచ్చినట్టుగానే, తామూ ఒకింటికి ఎప్పటికయినా, కోడళ్ళుగా వెళ్తామని, అక్కడ తాము, తమ ఆడబిడ్డలచేత ఇలాగే చూడబడి, ఇదే పరిస్థితిలోవుంటే, ఏమనుకుంటామోనని ఒక్కసారి భావిలోకి ఆలోచించిచూస్తే, ఇటువంటి దుస్సంఘటనలు మరింకెప్పటికీ జరగటానికి అవకాశముండదు.



## ప్రయోజనం

'మహిళలు — ఉద్యమాలు' రచయిత్రి డి. సీతా హైమవతిగారి వ్యాసము ప్రయోజనాత్మకంగా వుంది. మానవత్వ కేంద్రం నుండి దైవత్వపు పరిధి చుట్టారు, ఆమె, [redacted] వ్యాసంలో. ఆమె ఆశించిన సంఘం కుదూరంలో వుందనుకొనేవాళ్ళు సుమారు లోకి తెచ్చుకోవాలంటే, ఆదర్శాలని ఆచరణలోకి తెచ్చుకొని ఆత్మస్థైర్యంతో కొత్త ప్రయోగాలు చేయాలి — యీ సంఘంలో.

* * *

సచిత్ర వారపత్రికలో శ్రీమతి డి. సీతా హైమవతిగారు వ్రాసిన "మహిళలు, ఉద్యమాలు"ను గూర్చి చదివితే నాకు చాల సంతోషకరముగా నున్నది. ఆమెకు నా హృదయపూర్వకాభివందనము లర్పించుచున్నాను. నారీమణులు నేటికైనా గుర్తించి ముందడుగు వేస్తారని భావించుచున్నాను. [redacted]"తెలుగు — వెలుగులు" పత్రికకు ఒక ప్రత్యేకఆకర్షణ కలిగిస్తున్నాయి. నమస్తే.

కుమారి కె. లలిత (నల్లూరు).

* * *

## చౌచౌ

ఈవారం పత్రిక (24-8-60) చాల ఆకర్షణీయముగానున్నది. సుగాత్రిగారు వ్రాసిన "అందం అలంకారం" అనే వ్యాసం నన్నెంతో ఆకర్షించింది. ఆ విషయం వున్నది వున్నట్లుగా చాల బాగా వ్రాసేరు. వ్యాసం చదువుచున్నంతసేపు "సుగాత్రి"గారి సామర్థ్యానికి [redacted] నేనెంతో నివాళు లర్పించెను. ఈవారం సరళ గారి సలహా లేకపోవుట చాల విచారకరమైన విషయంగా వున్నది.

ఈమధ్య పత్రికలో మంచిమంచి వంటకాలేమీ ప్రచురించుటలేదు. కారణం? ఇకమీదనుంచి మంచి మంచివి, పెద్ద పెద్దవి అయిన Sweets and Hots ప్రచురిస్తారని ఆశిస్తాను. ఎందుకనగా వచ్చేది దసరా పండుగలు కదా!

ఏరకమైనా పూగుగాయలు పెట్టుటైనా నేర్పించమని ప్రార్థన. క్రొత్తగా ప్రచురిస్తున్న బెన్‌హర్ చాల బాగుంటున్నది. ఇకమీదటనుండిగూడ పత్రిక ముందడుగు వేస్తూ ఉంటుందని ఆశిస్తున్నాను.

ఎన్. ఎస్. సంధ్యావళి.

* * *

# వనితా వాణి

## ఉత్తమం!

ఈ వారపు (17-8-60) పత్రికలో "మహిళలు - ఉద్యమాలు" అన్న వ్యాసం డి. సీతా హైమవతిగారు చక్కగా వ్రాశారు. ఆమె వివేచనా, జ్ఞానసంపన్నురాలు గానున్నదున్నట్లు వ్రాయగల్గినారు. నిజానికి లేనివాటికై తాపత్రయపడక ఉన్న హక్కులనే సద్వినియోగించుకొనిన మహిళలకు లేనిదేమున్నది? అసలు "ఉట్టి" భ్రమతో "మగవా" రేదో "ఘోరం" చేసేస్తున్నారని ప్రచారం చేసికొనుటమేగాని నిజానికి "మగ" వారు మహిళలకు చేసే అపకార మేమీలేదు.

ఏది యేమైనప్పటికి యీ వార మీ వ్యాసాన్ని మించినదేదీ లేదు. నే నిట్లు వ్రాయుట మగవారిని వెనుకేసుకొని వచ్చినట్లు ఆ సీతా హైమవతిగారు వ్రాయుటవలననే యని తలపకుందురు గాక.

* * *

## నిద్రామాయణం

10-8-60వ తేదీన రాధగారు వ్రాసిన 'నిద్రారాక్షసం' అన్న వ్యాసం చాల బాగుంది. అయితే ఇంకొ నాకు తోచిన సలహాలు చెబుతాను. విశ్రాంతి యనగా పనిని జేయక సుఖముగా నిద్రపోవుట. పెందలకడ నిద్రపోయి పెందలకడ నిద్ర లేచుట మనుష్యున కారోగ్యప్రదమని వైద్యుల అభిప్రాయము.

పసిబిడ్డలు దినమునకు 16 గంటలును, 4 సం|| ల బిడ్డలు 12 గంటలును, 12 సం|| [redacted] బాలురు 10 గం|| లును, 16 సం|| ల బాలురు 9 గంటలును, పెద్దవారిలో పురుషులు 7 గంటలును, స్త్రీలు 8 గంటలును నిద్రపోవలెను. ముసలివారు ఎక్కువ నిద్ర పోవలెను.

బాగా నిద్రపోవాలంటే (1) పగటిపూట నిద్రపోకూడదు (2) మంచి గాలిగలచోట పని చేయవలెను. (3) ఎనిమిదిగంటలకు భోజనము చేసి 10 గంటలలోగా నిద్రపోవలెను. (4) తక్కువగాను, తేలికగాను రాత్రిపూట భుజింపవలెను. (5) పస్తుపరుండరాదు. (6) ఎడమవైపు పరుండరాదు. ఎందుకనగా గుండె అన్నకోశము పనిచేయుచుండును. అతిగా భుజించుటవలన అజీర్ణాదివ్యాధు లెట్లు పుట్టుచున్నవో అటులే అతి నిద్రపోవువారికిని వ్యాధులు గలుగును.

అతి నిద్రవల్ల తలనొప్పి, శిరోభారం, నిస్సత్తువ, కార్శ్యతీత, మైకము మొదలగునవి కలుగును. మితిముగా నిద్రపోవుట దేహారోగ్యమునకు మంచిది.

పి. పద్మావతి (పొన్నూరు)

* * *

## సరళగారికి సలహా

మేము 15 మంది స్నేహితులము సరళగారి సలహా 1 గం. క్రితం చర్చించి చివరకు వినుకున్నా మంటే "సరళగారు ఈ విధంగా పక్షపాతంగా మగవాళ్లను తిట్టడం" ఏమీ బాగులేదు. సరళగారు ఇలా ప్రఖ్యాతి గాంచిన పత్రికలలో వ్రాయకూడదు.

తే|| 3-8-1960 ఆంధ్ర సచిత్రవారపత్రికలో పడ్డ "సరళ సలహా" చదివి మేముచాలా బాధ పడ్డాము. "ఆంధ్రపత్రిక" వంటి మంచి పత్రికలో యిలాంటి పక్షపాత సలహాలు ఇవ్వడం చాలా శోచనీయం. ఏమైనప్పటికీ కూడా "సరళ"గారు అసభ్యముగా, అమానుషంగా అవిధంగా మగవాళ్లను దూషించడం బాగులేదు.

ఇట్లు

బి. మాధవరావు, ఎం. సుబ్రహ్మణ్యం, పి. కృష్ణమూర్తి, పి. జగన్నాధరావు, బి. వసంతరావు, ఎ. సి. కృష్ణన్, ఎం. కృష్ణమోహన్, పి. నాగరాజు, పి. సుధాకర్ రావు, వై. భుజంగరావు, సి. వి. సుబ్రహ్మణ్యం, ఎల్. సీతారామన్, ఎం. జనార్ధన్, వై. శ్రీనివాసులు, ఎం. వెంకటరమణరావు.

* * *

## ఎవరని?

డియర్ సరళారావ్!

ఇంతమంది సోదరీమణులు అమాయకతో మీ కఖండంగా హారతులెత్తితే, కమ్మగా, విగ్రహమూర్తులై అందుకుంటున్నారే! మీ రెంత పాత్రికేయులైనా మా సోదరీమణులందరూ చూపే అభిమానానికైనా కనీసం, కరగి మీ మారురూపు ఉపసంహరించుకొనండి. స్త్రీ అయినా, పురుషుడయినా మీసలహాలు చాలాబాగున్నమాట వాస్తవం. మిమ్ముల్ని అందుకు అభిమానిస్తున్నాను. అభినందిస్తున్నాను. ఆ సలహాలను నిజంగా ఈ. చ. తప్పక పాటించలేమని మీరే చెప్పకోవటం మీ సహృదయతను తెలియబరుస్తుంది.

అయినా మీరు సత్యాన్ని దాచటానికి గల కారణం తెలుసుకోవటానికి కుతూహల పడుతున్నాము. ఆ కుతూహలమే ఈ ఉత్తరం వ్రాయటానికి కారణమయింది. అది మీ పాత్రికేయులకు సంప్రదాయమా? ఇంతకీ మీరు కర్మధారయమా? లేక షష్ఠీ తత్పురుషయా? కనీసమయినా తెలపగోర్తాను. మీ సలహా ప్రతివారం మాకందజేయ గోర్తాము.

—మిస్ ఎక్స్.

*ఏదీకాదు-సరళ బహువ్రీహి సమాసం.



# ఆదర్శం

(20 పేజీ తరువాయి)

అక్కడి ఎగుమతులను అదుపు చేసి, వ్యాపారస్థుల అమ్మకం, కొనుగోలుల గూర్చి సరిగ్గా కనుక్కొని, కేంద్రప్రభుత్వ అమ్మకం, ఆదాయం పన్నులవాళ్ళకూ, రాష్ట్రప్రభుత్వ అమ్మకం పన్నులవారికీ మధ్యవర్తిగా వర్తించడమూ, మార్కెట్టులోని ఒడుదుడుకులకు వ్యాపారస్థులు తట్టుకొనేటట్టు చూడడం, వాళ్ళకు తగిన కోటా ఏర్పాటుచేయడం ప్రభాకర్ ఉద్యోగపు విధులు.

ముత్యంపేటలో బ్రాహ్మణ భోజన హోటళ్ళేమీలేవు. ఉద్యోగపు తాహతు ననుసరించి ముత్యంపేటలోని పెద్ద మిల్లు యజమాని రాజారాం సెట్టిగారు ప్రభాకర్ కు మిల్లులో ఒక గదిలో బస ఏర్పాటుచేశారు. ప్రభాకర్ కు పూటపూటా కారియర్ లో భోజనం వస్తూంది.

కారియర్ గూర్చి రాజరాం సెట్టిగారి నడిగితే బ్రాహ్మణుల ఇంటినుంచే తెప్పిస్తున్నానని బదులిచ్చారు ప్రభాకర్ కు.

"ఏమిటి పంతులుగారూ. మీ కారియరూ, బస ఖర్చులూ మేమెక లెక్కలోకి తీసుకోం. కానీయండి. దయ మాత్రం ఉంచండి" అని అన్నారు రాజరాంసెట్టిగారు లౌక్యంగా.

రాజారాంసెట్టిగారి ధోరణి ఏమీ బోధపడలేదు ప్రభాకర్ కు. మిల్లులో పనిచేసే వాళ్ళద్వారా తనకు కారియర్, మిల్లు మేనేజర్ జగన్నాథంగారింటినుంచి వస్తూందని తెలుసుకొన్నాడు.

జగన్నాథంగారు పెద్దమనిషీ, గౌరవనీయు డన్న అభిప్రాయం కలగటంవల్ల ప్రభాకర్ జగన్నాథంగారితో ఆయన ఇంటినుంచి వచ్చే కారియర్ గూర్చి ప్రస్తావించి, ఆయన కభ్యంతరం లేకుంటే ఆయనతోపాటే తను కూడా భోజనానికి ఇంటకే వస్తానని, భోజనం తనకు ప్రత్యేకంగా పంపటం అవసరం లేదని కోరాడు ప్రభాకర్.

"దీనికేం. ఇంటికొచ్చే భోజనం చెయ్యండి. నాతోపాటే రావాలనే నియమం కూడా లేద"ని ఆప్యాయంగా బదులిచ్చారు జగన్నాథంగారు.

మరుసటి రోజునుంచి ప్రభాకర్ జగన్నాథంగారింటికి భోజనానికి వెళ్ళుతున్నాడు.

భోజనానంతరం జగన్నాథంగారూ, ప్రభాకర్ కొంతసేపు కూర్చొని తప్పనిసరిగా మాట్లాడుకొనేవారు. వాళ్ళ కబుర్లలో పట్నంలో బి. ఏ. పరీక్ష రాసివచ్చిన జగన్నాథంగారి రెండో అమ్మాయి సుశీలకూడా పాల్గొనటం పరిపాటయింది.

రోజులు గడుస్తూన్నకొద్దీ జగన్నాథంగారి కుటుంబంలోని మనిషిగా మెలిగే ప్రభాకర్ కు సుశీలతో చను వెక్కువౌతోంది.

ఆవేళ పేపర్లో బి. ఏ. పరీక్షా ఫలితాలు ప్రకటింపబడినాయ్. పోలీస్ స్టేషన్ దగ్గరుండే కిళ్ళీకొట్టువద్ద రోజూ పేపరుకోసం కాచుకొని కూర్చునే ప్రభాకర్ పేపర్లో సుశీల నెంబరు చూచి పాస్యయిందని గంతేసి జగన్నాథం గారింటికి ఆత్రుతతో వెళ్ళి, సుశీలకు అభినందనలు తెలిపాడు.

సుశీల కృతజ్ఞతా సూచకంగా "కొద్ది రోజుల పరిచయంవల్ల మా కుటుంబంతో మీ కెంత ఆత్మీయత అల్లుకుపోయిందం"టూ సముచితంగా బదులు పలికింది.

ఓ రోజున జగన్నాథంగారు మిల్లు పని మీద విజయవాడ కెళ్ళారు. ఆ రాత్రి సుశీల, ప్రభాకర్ ఇద్దరూ కలిసి భోజనం చేశారు.

"మిస్టర్ ప్రభాకర్ రండి. మేడపైకెళ్ళి మాట్లాడుకొంటూంటాము. ఈలోగా మా అమ్మగారూ, అక్కయ్యా పని తెముల్చుకొని వాళ్ళూ వస్తారం"ది సుశీల నిస్సంకోచంగా వాళ్ళమ్మగారి ఎదుటే. మేడమీదికి ప్రభాకర్, సుశీలా వెళ్ళారు.

అప్పుడే మబ్బులన్నీ తొలగి నిర్మలమైన నింగి స్వచ్ఛమైన వెన్నెలను వెదజల్లుతూంది.

ఇద్దరూ మనస్సువిప్పి మాట్లాడుకొన్నారు.

సుశీల ప్రభాకర్ అందాన్ని ఉన్నదున్నట్టు పొగడింది. ప్రభాకర్ మర్యాదకోసం మొదట కొంచెం సంకోచపడ్డా సుశీల రూపాన్ని ప్రతిగా పొగడాడు.

సుశీలఅమ్మగారూ, అక్కయ్యా మేడమీదికొచ్చారు. అందరూ కలిసి మాటల్లోకి దిగారు.

సుశీల అక్కయ్య జ్యోతిని ముఖాముఖిగా చూడటం ప్రభాకర్ అదే మొదటిసారి. తెల్లటి చీరకట్టుకొని సున్నగా తలదువ్వి, అందంగా ఉన్న జ్యోతి వితంతువని తెలుసుకోగానే కొద్దిక్షణాలు మూర్ఛపోయాడు ప్రభాకర్. కాని వితంతువుల మళ్ళీ పెళ్ళిళ్ళకై కంకణం కట్టుకొన్న తన ఏకైక లక్ష్యంతో జ్యోతిని ఒడ్డుకు చేర్చి, మోడైన ఆమె జీవితాన్ని తిరిగి చిగిరింపజేయాలని సంకల్పించుకొన్నాడు ప్రభాకర్.

* * *

మిల్లుకు తిరిగొచ్చి తన స్థానంలో కూర్చొన్న ప్రభాకర్ కు పనిమీద బుద్ధి పోలేదు. రంగయ్య చౌదరిగారు చుట్టుపక్క ఊళ్ళలో తాను కొనుగోలు చేసిన నాలుగైదు లారీలు వేరుసెనక్కాయల్ని గోడౌన్ లో దింపుతున్నాననీ, తనిఖీకి రమ్మని

# ఇప్పుడు

## మీకు ప్రియమైన

## ఆరోగ్యముచేకూర్చే

# విటమినులు కలిసిన

# వాటర్‌బరీస్ కాంపౌండ్

## తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్పబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.




# వాటర్‌బరీస్

విటమిన్

# కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.



దగ్గు, జలుబులకు క్రిసోట్ మరియు గ్వైకాల్‌తో
కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్
గల సీసాలో కూడా లభించుచున్నది.

# ఆదర్శం

కబురుపెడితే బంట్రోతు కాపని పురమాయించాడు ప్రభాకర్. ఇంతకు పూర్వం ఓ బండెడు ధాన్యమైనా తనే స్వయంగా వెళ్లి తనిఖీ చేసేవాడు ప్రభాకర్. సాయంత్రమో రాత్రో ఏలాగైనా వీలు కలుగజేసుకొని, జ్యోతిని కలుసుకొని ఉత్తరాన్ని చూపి, నిజానిజాలు తెలుసుకోనేందుకు ఉబలాటపడుతున్నాడు ప్రభాకర్.

"ఏం. నాన్నా ప్రభాకర్ రాలేదే?" అడిగింది సుశీల.

"లేదమ్మా. ప్రభాకర్ ఇవ్వాళ ఉదయం ఏడుగంటల బస్సులో వాళ్ళ ఊరికి వారం రోజులు సెలవుపెట్టి వెళ్ళాడట. నిన్నంతా అతను మనస్సులో ఏదో మధన పడుతున్నట్టు ప్రభాకర్ వాలకాన్ని గమనించిన ఇద్దరు ముగ్గురు మిల్లులో చెప్పారు. పొరుగూరికి క్యాంపు వెళ్లేటపుడు కూడా నాతో చెప్పి వెళ్లే అతను ఇప్పుడిలా హఠాత్తుగా వెళ్ళిపోవటం నాకాశ్చర్యంగా వుంది" అని బదులిచ్చారు జగన్నాథంగారు.

"ఉత్తరం మహిమన్నమాట" అంది వ్యంగ్యంగా సుశీల ఎవరికీ అర్థంకాని ధోరణిలో.

"ఉత్తర మేమిటమ్మా?" ప్రశ్నించారు జగన్నాథంగారు.

"నాన్నా, మనింట్లో వ్యవహారాలు శ్రుతిమించాయ్. తీయగా మాట్లాడి మన కంతో ఆప్తుడిలా నటించే ప్రభాకర్ ఒక గోముఖ వ్యాఘ్రం. ఆదర్శాలూ ఆశయాలని మరిపించి అక్కయ్యను తనవల్లో వేసుకొన్నాడు! తను రోజూ వల్లించే కన్యాశుల్కంలోని గిరీశం లాంటివాడతను. తిన్న ఇంటివాసాలు లెక్కపెట్టేరకం. అతనికి బాగా బుద్ధి చెప్పాలని నేనే నిన్నొక అకాశరామన్న ఉత్తరాన్ని సృష్టించి పంపాను. దాంతో అతను తారెత్తి తోక జాడించి నట్టుంది. మన కుటుంబ గౌరవం కోసం ఇలా చేశాను. నాన్నా." సూటిగా బదులిచ్చింది సుశీల.

సుశీల దస్తూరీతో తను చూడటం తటసించిన ఉత్తరం గూర్చి ప్రభాకర్ నిన్నటి దినం అబద్ధమాడటం, ఉత్తరాన్ని బయట పెట్టి తన నిజాయితీని నిరూపించుకోకుండా పిరికివానిలా ప్రభాకర్ వెళ్లిపోవడం, ప్రభాకర్ పై జగన్నాథంగారిలో అనుమానాలు రేకెత్తినాయ్. సుశీల చెప్పిన మాటల్లో నిజముండక పోదనుకున్నాడు. చదువుకొన్న సుశీల ఉత్తరంతో ఇంటిగుట్టును వెలికి రాకుండా చేసిన తొలి ప్రయత్నాన్ని మనస్సులో మెచ్చుకొంటూ "మంచిపని చేశావమ్మా" అని బయట కనేశాడు జగన్నాథంగారు.

వంటింట్లోంచి ఈ సంభాషణంతా విన్న జ్యోతి కుప్పగా కూలిపోయినట్టయింది.

"కల్లా కపటాలు లేని ప్రభాకర్ గారి పట్ల ఎంత అవమానకరంగా మాట్లాడింది సుశీల! ఆయనెంత మంచివారు, అభ్యుదయ భావాలు కలవారు. నిన్నటి రాత్రే ఆయన మేడమీది కెంతో ఆతృతతో వచ్చి, తనను కలుసుకొని, సుశీలరాసిన ఉత్తరాన్ని చూపెట్టి ఏదేమైనా నట్టేట్లో తనను ముంచనని, తప్పక పెళ్లి చేసుకొంటానని వారంరోజుల సెలవు మీద ఊరెళ్ళి వాళ్ళఅమ్మ, నాన్న గార్లతో తిరిగొచ్చి పెళ్ళి ముహూర్తం నిశ్చయించుకొంటామని, తనచేతిలో చెయ్యేసి వెళ్ళారు. తొందరలో నాన్న గారితో చెప్పడం మరిచి వెళ్ళారేమో! చదువుకొన్న సుశీల కెంత స్వార్థబుద్ధి. ప్రభాకర్ గారు తనను ప్రేమించారన్న ఓర్వలేనితనం సుశీలలో ఎంత గాఢంగా నాటుకుపోయింది. ఇప్పుడు తన అక్క జీవితం హాయిగా ఉండటం ఇష్టంలేక, అక్క మీదే అభాండాలు కల్పిస్తోంది"–ఇలా మనస్సులో అనుకొన్న జ్యోతి, పైకి మాట్లాడాలనుకొని, బయటికొచ్చి పొంగి పొరలివచ్చే దుఃఖభారంతో మాట పెగిలిరాక అక్కడ నిల్చుని ఉన్న తల్లిపై వాలిపోయింది. అప్పటికే భోజనం పూర్తిచేసిన జగన్నాథంగారు చేయికడుక్కొని, గబగబా మిల్లుకు వెళ్ళిపోయారు.

నాల్గోరోజు ప్రభాకర్ వద్దనుంచి ఉత్తరం వచ్చింది.

మెఱుసటిరోజు మధ్యాహ్నం మూడు గంటల మెయిల్ బస్సులో వరుడూ, అతని తల్లిదండ్రులు జ్యోతినిచూచి ముహూర్తం నిర్ణయించుకోవటానికి వస్తున్నారని, వారికి జ్యోతి మళ్ళీ పెళ్ళి అంగీకారమేనని ప్రభాకర్ వ్రాసిన ఆ ఉత్తరంలోని సారాంశం.

జగన్నాథంగారి చేతిలోనుంచి సుశీల ఉత్తరం అందుకొని చదివి "విన్నారా. నాన్నా. ప్రభాకర్ గారి త్యాగం! రెండో మనిషిని వరుణ్ణిగా పంపిస్తున్నాడు! అక్కడ వాళ్ళతో గిరీశంగారి కోత లేమి కోశాడో! వాళ్ళీతని బుట్టలో పడి బయలుదేరుతున్నట్టున్నారు" అంది సుశీల.

సుశీల వాఖ్యానం విన్న జగన్నాథంగారికి ప్రభాకర్ పై కోపం ముంచుకొచ్చింది.

జ్యోతికూడా కాస్త కంగారైంది. కాని, ఆమె మనస్సు ప్రభాకర్ నిజాయితీపరుడని ప్రబోధిస్తూ వుంది.

"మెయిల్ బస్సులో" దిగి ఓ ముసలాయనా, ఓ ముసలావిడా బెడ్డింగ్ తో సహా జగన్నాథంగారింటి కొచ్చారు.

ఇంట్లోకి రాగానే పళ్ళాన్ని తెమ్మని సంచిలోనుంచి తీసి 'లేటెస్టు ఫేషన్' లోనున్న రెండు చీరల్ని, రెండు జాకెట్లనూ, పూలు, పళ్ళతోసహా పళ్ళెంలో ఉంచారా ముసలాయన. జ్యోతొకటి, సుశీలొకటి చీరల్ని కట్టుకోవాలని తన కొడుకు కోరినట్టు చెప్పాడాముసలాయన.

సుశీల తెచ్చిన కాఫీని తీసుకోకుండా తటపటాయిస్తూ, గుమ్మంకేసి చూస్తున్న జగన్నాథంగారిని చూచి "కాఫీ పుచ్చుకోండి. వాడికోసం చూస్తున్నారేమో. వాడు మిల్లు దగ్గర దిగేశాడు. వస్తాడులెండి" అన్నారు ముసలాయన.

ఈలోగా కాబోయే వియ్యపురాలు వంటింటి ప్రక్కనుండే గదిలోనుంచి ముసలాయన దగ్గరికొచ్చి "జ్యోతి బాగుంటుందండి. మీకు కాఫీ, ఫలహారా లివ్వలే సుశీల. పిల్లలాగే ఉంటుంది జ్యోతి" అంటూ వీధి గుమ్మంవైపు చూచి "ఇదిగో మనవాడు కూడా వస్తున్నాడు. వాడప్పుడే అన్నీ చెప్పేడుగా. మనం ముహూర్తం నిర్ణయించుకోవచ్చును" అన్నది.

ప్రభాకర్ ఇంట్లోకి ప్రవేశించిన వెంటనే అతన్నిచూచి "ప్రభాకర్. నిన్ను అపార్థం చేసుకొన్నాము. మన్నించవూ" అన్నారు జగన్నాథంగారు.

కుర్చీలో కూర్చొన్న ప్రభాకర్ కు ఫలహారం పళ్ళాన్ని అందిచ్చి, తలవాల్చి "బావా. నీ ఆదర్శాన్ని అపార్థం చేసుకొని, చిలవలు పలవలు కల్పించాను. నన్ను ప్రత్యేకంగా మన్నించవూ" అంది సుశీల. సుశీల వేడి కన్నీటిధారలు ప్రభాకర్ పాదాలపై పడ్డాయి.

సుశీల పశ్చాత్తాపాన్ని, ప్రభాకర్ ఆదర్శాన్ని, మామగారూ, అత్తగార్ల అభ్యుదయ భావాల్ని మనస్సులో ప్రశంసించుకొంటూ ఆనందబాష్పాలు రాల్చింది జ్యోతి.



---

ఉపాధ్యాయుడు — ఒరేయి గోపీ, గాడిదకాళ్ళు ఎలా ఉంటాయో చెప్పరా.

గోపీ — నాకు తెలియదు సార్.

ఉపా — పోని నువ్వు చెప్పరా, రామూ.

రామూ — మీ కాళ్ళలాగా ఉంటాయి సార్.

— పోతుకూచి యజ్ఞేశ్వరశాస్త్రి
(నల్లగొండ.)

# ‘బాగుపడాలి’ అంటే...

పూర్వం మిథిలానగరాన్ని అవంతుడు అనే రాజు పాలిస్తుండే వాడు. అవంతుడు అన్ని విధాల ప్రజలను సుఖపెడుతూ పాలిస్తున్నాడు. ప్రజలు ఏ కష్టాలు లేక అవంతుని ఏలుబడిలో హాయిగా వుంటున్నారు. కాని ఉన్నట్టుండి అకస్మాత్తుగా ఒకనాడు అవంతుని మంత్రి దివంగతు డయ్యాడు. ఏ గడ్డు సమస్యనైన ఇట్టే పరిష్కరించే మంత్రి పోవడంతో అవంతునికి అవాంతరాలు ఏర్పడ్డాయి. మంత్రి లేకుండా పాలన సాగించడం కష్టం.

అవంతుడు మరో మంత్రిని నియమించుకోవాల్సి వచ్చింది. మంత్రి పదవికి మహామేధావి అఖండప్రజ్ఞావంతుడు కావాలి. మంత్రి అంటే ఆషామాషీ కాదు. సర్వవిషయాలు తెలుసుండి సర్వసమర్థుడై వుండాలి. అలాటివానికోసం అన్వేషణ సాగించాడు అవంతుడు. దేశదేశాలు ప్రకటన చేయించాడు.

పలువురు మంత్రి పదవికోసం వచ్చారు. కాని ఎవరూ నచ్చలేదు అవంతుడికి. పూర్వం తన మంత్రి లాంటివాడు కావాలని ఆశించాడు అవంతుడు. పదవికోసం వచ్చిన వారిలో ఎవరూ సమర్థులు కనిపించ లేదు అవంతుడికి.

ఒక గ్రామంలో లోకనాథం, శివనాథం అని ఇద్దరు వున్నారు. శివనాథం సర్వశాస్త్రాలు తెలిసినవాడు, తెలివైనవాడు, సమయస్ఫూర్తిగలవాడు. లోకనాథం కూడా విద్యావంతుడే. కాని అసూయాపరుడు, ఆశాపరుడు. శివనాథం మంత్రిపదవి పొందాలని బయలుదేరాడు అతనికి పోటీగా బయలుదేరాడు లోకనాథం. శివనాథం రాజుగార్ని చూడ్డానికి బయలుదేరాడు. వెళ్లేటప్పుడు, శ్రీకృష్ణుణ్ణి చూడ్డానికి వెళ్లేటపప్పుడు కుచేలుడు అటుకులు తీసికెళ్ళినట్టు, రాజుగారి కోసం ఓపాతిక జంతికలు మూటకట్టుకుని బయలుదేరాడు. లోకనాథం కూడా ఓపాతికజంతికలు మూటకట్టాడు.

ఇద్దరూ నడిచి నడిచి ఒక అరణ్యం చేరుకున్నారు. కాళ్ళు లాగుతున్నాయేమో ఓ చెట్టుక్రింద కూర్చున్నారు. వారిద్దరికీ కూడా ఆకలి వేసింది. మూటలు విప్పి జంతికలు తిని ఇన్ని మంచినీళ్లు తాగి మిథిలా నగరం చేరుకున్నారు. రాజుగార్ని దర్శించుకొన్నారు. అవంతుడు ఎందుకు వచ్చారని అడిగాడు.

మంత్రి పదవి కోసం వచ్చామన్నారు.

శివనాథం మూట విప్పి అవంతుడి యెదుట బెట్టి “మహారాజా తమ కోసం ఓపాతిక జంతికలు తెచ్చాను. అంతకన్న విలువైనవి తమకు సమర్పించ లేనందుకు విచారిస్తున్నా” అన్నాడు. అవంతుడు లోకనాథం దగ్గరున్న మూటచూసి నువ్వేం తెచ్చావని అడిగాడు.

‘మహారాజా! నేనూ అతనితో సమానంగా జంతికలు తెచ్చాను. కాని మార్గమధ్యంలో ఆకలివేసి పదిమాత్రం తిన్నాను” అని మిగిలిన రాజుగారి ఎదుటవుంచాడు లోకనాథం తన ఆకలిబాధ, లేమితనం రాజుగారు గుర్తించి మంత్రిపదవి తనకు ఇస్తారనే ఆశతో.

కాని శివనాథం కూడా తిన్నట్టు చెప్పి అతడబద్ధాలకోరు అని నిరూపణచేసి తను సత్యవాదినని బుజువు చేసుకోవాలని అనుకొన్నాడు లోకనాథం.

“మహారాజా! శివనాథం కూడా మార్గమధ్యంలో జంతికలు తిన్నాడు. ఇంటిదగ్గర నుండి ఇరవై అయిదు తెచ్చానన్నాడు. ఇక్కడ మీ సమక్షంలో వుంచినవి కూడా ఇరవై అయిదే. దాన్నిబట్టి చూస్తే ఇంటి దగ్గరనుండి ఇంకా తెచ్చివుండాలి. ఎక్కువతెచ్చి ఇంతే తెచ్చానడం అబద్ధమని తేలిపోతోంది. ఇలా అసత్యం వచించేవాడికి మంత్రి పదవి కట్టబెట్టడం ప్రమాదం. ఆలోచించండి” అన్నాడు లోకనాథం.

ఈ పాటికి రాజుగారు తనలోని నిజాయితీని అర్థం చేసుకొని వుంటారని సంబరపడ్డాడు.

**“ఇది నిజమేనా?”అని అవంతుడు అడిగాడు.**

“వరహాగిరి”



అందుకు శివనాథం వినమ్రుడై ఇలా చెప్పాడు: "చిత్తం మహారాజా ఇంటిదగ్గరనుండి ఇరవై అయిదు తెచ్చినమాట నిజమే; మార్గమధ్యంలో ఆకలివేసి తిన్నమాట నిజమే. కాని జంతిక ఆకారంమాత్రం మారలేదు. నేచేసిందొక్కటే; వంచలు విరుచుకుని తిని శాల్తీలు ఉంచాను. నేనెన్నితిన్నా మీకు లెక్క సరిపోయిందిగా" అన్నాడు.

అనంతుడు అతడి మేధాశక్తికీ, సమయస్ఫూర్తికి సంతోషించాడు. వెంటనే మిథిలానగరానికి మంత్రిగా నియమించాడు శివనాథాన్ని. ఎవడైనా ఒకడు బాగుపడాలంటే అతడి శ్రేయస్సు కోరేవాళ్ళేకాక ఈర్ష్య చెందేవాళ్లు కూడా ఉండాలి. అపుడే అటువాని మంచి అందరికి తెలుస్తుంది. ★

# వింత షరతులు

పూర్వకాలంలో రాఘవేంద్రుడనే మహారాజు వుండేవాడు. ఆయనకు 'సురేఖ' అనేకూతురు తప్ప - కొడుకులు లేరు. అందుకని తన అల్లుడినే రాజ్యానికి వారసుడుగా చేద్దామని ఆయన నిశ్చయించుకున్నాడు. సురేఖ-ఆ రాజ్యపు సేనాధిపతి కొడుకు రఘువీర్ ని ప్రేమించింది. రఘువీర్ సేనాధిపతి కొడుకవటం వల్ల అతను రాజ్యాన్ని పాలించలేడని - సేనాని కొడుకుని అల్లుడుగా చేసుకోవటం అవమానం అని రాఘవేంద్రుడు సురేఖను మందలించాడు. కాని సురేఖ-రఘువీర్ ని తప్ప మరొకర్ని పెళ్ళిచేసికోనని పంతం పట్టింది. అందుచేత ఏదో మిష మీద రఘువీర్ ని పరాయి దేశాలకు పంపి అతను తిరిగి వచ్చేలోగా సురేఖ పెళ్ళి మరొకళ్ళతో చేసేద్దామనుకుని - రాఘవేంద్రుడు - సేనాధిపతి-రఘువీర్ తండ్రి అయిన జయవీర్ ని పిలిపించి యిలా చెప్పాడు: "జయవీరా! నీ తర్వాత నీ అంతటివాడు మా రాజ్యానికి సేనాధిపతిగా వుండటానికి వారసుడు నీకుమారుడే కదా! అందుకని నీ కుమారుని పరాక్రమం చూడాలని కోరికగా వుంది. కనుక రఘువీర్ ని పరదేశాలకు

బంధకవి ఉదయశంకర్

పంపి మూడు నెలలలోగా ఎన్ని రాజ్యాల్ని జయించుకొస్తాడో రమ్మను" అని చెప్పి జయవీర్ ను పంపివేశాడు. ఇందులోని కిటుకు తెలియని సేనాధిపతి రఘువీర్ ను దండయాత్రలకు పంపడానికి ఏర్పాట్లు చేశాడు. కాని ఆకిటుకు-తండ్రి దురుద్దేశం సురేఖ గ్రహించింది.

రఘువీర్ దండయాత్రకు వెళ్లబోయే ముందు సురేఖను కలుసుకున్నాడు. అతనితో తండ్రి పన్నిన పన్నాగంగురించి చెప్పి 'దండయాత్రకు వెళ్లవ'ద్దంది. కాని రఘువీర్ "ఆయన నీకు తండ్రి. నాకు ప్రభువు. ప్రభువు ఆజ్ఞ ధిక్కరించకూడదు" అన్నాడు. "నేను కూడ వస్తాను. మనిద్దరం ఎక్కడికైనా పారిపోదాం" అంది సురేఖ. "మనిద్దరం అవివాహితులం కదా! నువ్వు నాతో పారిపోయి వచ్చేస్తే నన్ను రాజద్రోహిగా పరిగణిస్తారు. నేను మూడునెల్ల తర్వాత-విజయంగా తిరిగి వస్తాను. అంతవరకు మీ తండ్రివేసిన ఎత్తుకు పైఎత్తు వేసి కాలయాపన చెయ్యి. నే విజయుడనై తిరిగివస్తే—మన వివాహానికి మీ తండ్రి తప్పక ఒప్పుకుంటాడు" అని చెప్పి రఘువీర్ దండయాత్రకు వెళ్లిపోయాడు.

కాలయాపనకొక చక్కటి వుపాయం ఆలోచించింది—సురేఖ.

మూడునెలలు గడిచి—రఘువీర్ తిరిగి వచ్చేలోగా సురేఖకు పెళ్లి చేసెయ్యాలనుకుని— వివిధ దేశాల రాకుమారుల చిత్రాలను తెప్పించాడు మహారాజు. అసలు రఘువీర్ ఏదో ఒక యుద్ధంలో తప్పక మరణిస్తాడని ఆయన వుద్దేశం. రాకుమారుల చిత్రాలను చూసి పెదవి విరిచింది—యిష్టంలేనట్టుగా. "ఇంత మంది అందగాళ్లలో ఒక్కడూ నచ్చలేదా?" అని అడిగాడు మహారాజు. "ఔను! నాయనగారూ! పైపై మెరుగులకూ—అందాలకు మోసపోకూడదు. అందముంటే ధైర్యముండదు—పోనీ ధైర్యంకూడా వుంటే తెలివి వుండదు. ఈ మూడు గుణాలూ వున్నవారినే పెళ్లి చేసుకుంటాను. అందుకని ఒక పరీక్ష ఏర్పాటు చెయ్యండి. అందులో నేను వేసే రెండు ప్రశ్నలకు సమాధానం చెప్పిన వారిని పెళ్లి చేసుకుంటాను. అతనికే రాజ్యపట్టాభిషేకం చెయ్యాలి" అంది సురేఖ. రఘువీర్ మాట మరిచిపోయి—అనలంటూ పెళ్లికి ఒప్పుకుంది కదా అని "సరే! అలాగే చేద్దాం—పోనీ"

# వింత షరతులు

అన్నాడు మహారాజు. "కాని ఒక షరతు—రాకుమారులే కాకుండా, లక్షాధికారినుంచి భిక్షాధికారి వరకూ—ఎవరైనాసరే నా ప్రశ్నలకు సమాధానం చెప్పవచ్చు. సమాధానం చెప్పలేనివారు—నా పెళ్లయేంతవరకూ ఖైదులో వుండి—ఆ తర్వాత—ఒక్కసారి చావకుండా—చిత్రహింస ననుభవించాలి" అంది సురేఖ. ఆశ్చర్యపోయాడు మహారాజు. "ఇదెక్కడి షరతు! ఉరి అయితే ఫర్వాలేదు కాని చిత్రహింస అంటే—ఎవరు ధైర్యంచేసి ముందుకు వస్తారు?" అనుమానం వెలిబుచ్చాడు మహారాజు. "చిత్రహింస అంటే—రోజుకో అవయవం తెగ్గొట్టాలి. ఏనుగులచేత తొక్కించాలి. సలసల మరుగుతున్న నూనెలో వేయాలి—యింకా ఏమైనా వుంటే అదీను. అందుకు ధైర్యమున్నవాళ్ళే వస్తారు. నేను చెప్పిందంతా తు. చ. తప్పకుండా ప్రకటించండి. లేదా మీకు నేను దక్కను" అంది సురేఖ. ఆ మాటతో హడలిపోయి అందుకు కూడా ఒప్పుకొని "సరే! యింతకీ ఆ ప్రశ్నలేమిటి?" అనడిగాడు మహారాజు. రెండు ప్రశ్నలు—వాటికవసరమైన జవాబులూ చెప్పింది సురేఖ. "మొదటి ప్రశ్నకైతే జవాబు చెప్పగలరు—కాని రెండవ ప్రశ్నకు ఎవరు-ఎన్నని చెప్పగలరు?" అనడిగాడు మహారాజు. "సూటిగా సమాధానం చెప్పనక్కరలేదు. విమర్శనాపూర్వకంగా వాదించి నిరూపిస్తే చాలు. నే చెప్పినట్లు చేయకపోతే నా మీద ఆశ వదులుకోవచ్చు. నాయనగారూ!" అంటూ మరొకసారి బెదరించింది-తండ్రిని సురేఖ. అలా చేయకపోతే కన్న ఒక్క కూతురూ దక్కదేమో నని-సురేఖ చెప్పినట్లు పరీక్షగురించి-అందులో వున్న నియమాలగురించి వివిధ దేశాల్లో చాటింపు వేయించాడు. చాటింపు విని-అందులోనూ చిత్రహింస అనేసరికి చాలమంది వెనుదీశారు. అలా వెనుదియ్యాలనేఅంత కఠినంగా షరతులు పెట్టింది సురేఖ. అలా కాకపోతే చాలామంది ప్రయత్నిస్తారు జవాబులు చెప్పటానికి. రఘువీర్ తిరిగి రాగానే తను వేసే ప్రశ్నలు వాటికి జవాబులూ అతనికి చెప్పి-అతనిచేత తండ్రి యెదుట జవాబులనే రఘువీర్ నోటమ్మట చెప్పిద్దామని-రఘువీర్ కోసం రోజులు లెక్కపెట్టుకుంటూ కూర్చుంది-సురేఖ.



పదిహేను రోజులు గడిచినా-ఎవరూ రాలేదు పరీక్షకు.

రఘువీర్-బయలుదేరిన వారం రోజులలోనే జయచంద్రుడనే రాజును ఓడించాడు. జయచంద్రుడు పరారి అయ్యాడు. అతను మరొక దేశంలోతలదాచుకొన్న సమయంలో రాఘవేంద్రుడు వేయించిన చాటింపు గురించి తెల్సింది. తనకిం కెలాగూ రాజ్యభోగాల్లేవు. తుదిసారిగా ఆ రెండు ప్రశ్నలకు సమాధానం చెప్పటానికి ప్రయత్నిద్దాం. అదృష్టముంటే తనకు మళ్ళీ రాజ్యంతో పాటు రాకుమారి సురేఖ కూడ లభిస్తుంది. లేదా రాకుమారిని వేడుకొని ఉరి తీయించమంటాను అని ఆలోచించి రాఘవేంద్రుని రాజ్యానికి వచ్చాడు జయచంద్రుడు. వచ్చి మహారాజునుకలుసుకున్నాడు. రాఘవేంద్రుడు అతనిని రహస్యమందిరానికి తీసుకువెళ్లాడు. అక్కడ రాకుమారి, మంత్రి, సేనాధిపతి మరిద్దరు ముఖ్యులు వున్నారు. 'సిద్ధంగా వున్నాను. ప్రశ్నించవచ్చు' అని జయచంద్రుడు అనగానే-' "మా సురేఖ చెప్పిన ప్రశ్నలను నేనే అడుగుతున్నాను" అని రాఘవేంద్రుడు మొదటి ప్రశ్న ప్రారంభించాడు: "పూర్వం జయవర్మ అనే రాజుకు 45-50 ఏళ్ల మధ్య ప్రాణగండం వుందని-ఆ గండం దాటితే నూరేళ్లూ సురక్షితంగా బ్రతుకుతాడనీ జ్యోతిష్కులు చెప్పారు. జోస్యంలో నమ్మకమున్న జయవర్మ చాల జాగ్రతగా ఉంటూ వచ్చాడు. రాత్రి తను పడుకున్న సమయంలో రామన్న భీమన్న నే వాళ్లిద్దర్ని కాపలా పెట్టుకున్నాడు. అందుకు రెండు షరతులు పెట్టాడు. ఒకటి; రాత్రి కాపలా సమయంలో

కావలా కాసేవాళ్లు నిద్రపోయినట్లు తెలిస్తే వారికి మరణశిక్ష విధించడం. రెండు—తనకు ముందుగా అపాయంగురించి తెల్పితే మంచి పురస్కారం చెయ్యటం. ఈ రెండు షరతులకూ అంగీకరించి రామన్న—భీమన్న రాత్రులు కావలా కాస్తున్నారు.

ఇలా వుండగా ఒకరోజున జయవర్మకు ఓడ ప్రయాణం చెయ్యాలని బుద్ధి పుట్టింది. కాని భీమన్న వద్దని వారించాడు. కారణమడగగా "నాకు నిన్న రాత్రి కలలో ఒక దేవత కనపడి మీ రాజు జయవర్మకు రేపే మరణగండం" అని చెప్పింది—ప్రభూ" అన్నాడు భీమన్న. అది వినగానే జయవర్మకు కోపం—ఆశ్చర్యం కలిగాయి. 'సరే' అని ఓడ ప్రయాణం మానుకుని జయవర్మ—ఆ రోజంతా జాగ్రత్తగా వున్నాడు. మర్నాడు జయవర్మ కొలువుతీర్చి వుండగా ఒక వార్తాహరుడు వచ్చి "ప్రభూ—నిన్న మీరు వెళ్లాలనుకొన్న ఓడకు ముందు బయలుదేరిన ఓడ సముద్ర మధ్యంలో తుఫానువచ్చి మునిగిపోయింది. అందులోని జనులందరూ మరణించారట." అన్నాడు. "దైవ కృపవల్ల మీ గండం గడిచిపోయింది. మీరు కూడ ఓడ ప్రయాణం చేసుంటే యీపాటికి మీ ప్రాణం కూడ పోయివుండేది" అన్నాడు మంత్రి. జయవర్మ కొంచెంసేపాలోచించి భీమన్నకు కబురు పంపించి—అతడు రాగానే "తక్షణం ఈ రాజ్యంనుండి వెళ్లిపో" అంటూ భీమన్నను దేశంనుండి బహిష్కరించాడు అని చెప్పి రాఘవేంద్రుడు—"భీమన్న చెప్పిన మాటలకు జయవర్మకు కోపం—ఆశ్చర్యం ఎందుకు కలిగాయి? ఆ తర్వాత భీమన్నను



'కామూనికి, వాళ్ళనాన్నకూ మన అన్నరే వచ్చిందటరా'

చిత్రకారుడు—శ్రీ ఎస్. వెంకటేశ్వరశాస్త్రి (జగ్గయ్యపేట)

దేశబహిష్కారం ఎందుకు చేశాడు?" అని ప్రశ్నించాడు జయచంద్రుణ్ణి. అతను కొద్దిసేపాలోచించి "తన ప్రయాణం ఆపు చేసినందుకు కోపం—ప్రాణగండంగురించి ముందే భీమన్నకెలా తెల్సిందా అని ఆశ్చర్యం జయవర్మకు కలిగాయి. ఆ తర్వాత—తన కపాయం తప్పింది కదా యిక కావలా అవసరంలేదు—వుంటే ఒకవేళ భీమన్నే తన్ని చంపవచ్చుననుకొని—భీమన్నను దేశంనుండి తరిమేశాడు—జయవర్మ—అంతే! రెండవ ప్రశ్న వెయ్యండి" అన్నాడు జయచంద్రుడు.

"ఆకాశాన్నున్న నక్షత్రాలెన్ని?" అడిగాడు రాఘవేంద్రుడు.

"కోట్లు!" అన్నాడు జయచంద్రుడు. "నువ్వు చెప్పిన సమాధానాలు రెండూ సంతృప్తిగా లేవు కనుక నిన్ను ఖైదు చేస్తున్నాను—" అని జయచంద్రుణ్ణి కారాగారంలో బంధించాడు రాఘవేంద్రుడు.

* * *

క్రమంగా మూడు నెలలూ గడిచాయి. అప్పటికి ఎనమండుగురు బంధింపబడ్డారు—సమాధానాలు చెప్పలేక.

ఇంక రేపో మాపో రఘువీర్ తిరిగి వచ్చేస్తాడు—అని భయపడసాగాడు రాఘవేంద్రుడు. కాని ఆ విధంగానే తలచి సంతోషం చెందింది సురేఖ. రఘువీర్ రాగానే-అతన్ని కలుసుకొని జరగవలసిన కార్యక్రమం గురించి మాట్లాడాలనుకుంది సురేఖ. ఆత్రుతగా ఎదురుచూడ సాగింది.

మూడు నెలల్లోగా కొన్ని రాజ్యాల్ని జయించి తనరాజ్యానికి తిరుగుముఖం పట్టాడు రఘువీర్. మార్గమధ్యంలో రాఘవేంద్రుడు ప్రకటించిన ప్రకటన విన్నాడు. తన సురేఖకు పెళ్లి కానందుకు చాల సంతోషించాడు. తను కూడ పరీక్షలో పాల్గొని తన తెలివితేటలను ఋజువు చేసుకోవాలనుకుని తొందరగా ప్రయాణం సాగించాడు.

మూడునెల్ల వారం రోజులు గడిచాయి. ఒకరోజున ఒక ఆజానుబాహుడు—గడ్డం—మీసం-తలపాగా ఉన్నవాడు—రాఘవేంద్రుణ్ణి కలుసుకున్నాడు 'ప్రశ్నలకు సమాధానం చెబుతానంటూ.' యథాప్రకారం అతన్ని రహస్యమందిరంలోకి తీసుకువెళ్ళి ప్రశ్నించారు. ఆ కొత్త వ్యక్తి

కొంచెంసేపు ఆలోచించి "నేను నిండుసభలో తప్పక జవాబులు—నా ఊరు, పేరు చెబుతాను—సభ ఏర్పాటు చెయ్యండి" అన్నాడు. అది వినగానే మిక్కిలి దుఃఖించింది సురేఖ—కాని మిక్కిలి సంతోషిం

## వింతషరతులు

చాడు రాఘవేంద్రుడు—రఘువీర్ రాకుండానే తన కూతురు పెళ్ళయి పోతుంది కదా అని. వెంటనే సభ ఏర్పాటు చేయించాడు. కొత్త వ్యక్తి సింహాసనందగ్గర లబడి "నేను రాజుగారి ప్రశ్నలకు సరియైన సమాధానం చెప్పగలననీ—అందుచేత మొదటి ప్రశ్న—రెండవ ప్రశ్నల గురించి సభికులందరకూ తెలియబరు

స్తున్నాను" అంటూ రెండు ప్రశ్నలు సభికులందరకు తెలియబర్చి మొదటి ప్రశ్నకు యిలా సమాధానం చెప్పాడు ఆ కొత్త వ్యక్తి: భీమన్న కాపలా కాసే సమయంలో నిద్రపోయి కలగన్నాడు. భీమన్న నిద్రపోయినందుకు కోపం-కలలో దేవత కనపడినందుకు ఆశ్చర్యం జయవర్మకు కలిగాయి. ఈ సందర్భంలో జయవర్మ పెట్టిన షరతుల ప్రకారం రెండు ఫలితాలనూ భీమన్న ఒక్కడే అనుభవించాలి. మొదటిది శిక్ష. రెండవది ఉపకారం. మొదటి షరతు ప్రకారం భీమన్నకు—నిద్రపోయినందుకు ఉరిశిక్ష వేయాలి. రెండవ షరతు ప్రకారం భీమన్నకే—అపాయం గురించి ముందు తెల్పినందుకు ఉపకారం చెయ్యాలి. ఎలా? తనను ప్రాణాపాయం నుండి రక్షించిన భీమన్నను ఉరి తీయడం మహాపాపం. అలా అని ఏదో వొకశిక్ష విధించకపోతే రాజ్యంలో న్యాయం సరిగా జరగటం లేదని జయవర్మకు అపవాదు వస్తుంది. అందుకని ఉపకారం చేసినందుకుగాను భీమన్న ప్రాణాలు నిల్పి-శిక్షగా అతన్ని దేశబహిష్కారం చేశాడు జయవర్మ. అలాచేసి తనుపెట్టిన షరతుల ప్రకారం జయవర్మ మరణశిక్ష తప్పించి వుపకారం చేసి, దేశబహిష్కారమే శిక్ష విధించి-అన్న ప్రకారం మాట నిలుపుకున్నాడు జయవర్మ. అంతే!" అన్నాడా కొత్తవ్యక్తి. సెభాష్! అన్నాడు రాఘవేంద్రుడు సంతోషంగా. అలా అనగానే సభలో జయజయ ధ్వానాలు మిన్నుముట్టాయ్.

"సరే! రెండవ ప్రశ్న ఆకాశాన్నున్న నక్షత్రాలెన్ని?"అనడిగాడు మహారాజు.

"ఈ రెండవ ప్రశ్నకు జవాబు ఎవరికీ తెలియదు ప్రపంచంలో. కాని మీ కేదో సమాధానం తెలుసును కనుక సమాధానం ఒక పత్రం మీద వ్రాసివుంచండి" అన్నాడా కొత్తవ్యక్తి. అది వినగానే సభలో గుసగుసలు ప్రారంభం అయ్యాయి. మహారాజు ఏదో పత్రంమీద వ్రాసి సరే జవాబు చెప్పు అన్నాడు. సభికులందరూ చెవులు రిక్కించి వినసాగారు. "నక్షత్రాల్ని ఎవరుఎన్నని చెప్పగలరు? నక్షత్రాల్ని ఎవరూ లెక్కపెట్టలేరు. అందులోనూ ఆకాశాన్నున్న నక్షత్రాల్ని. చెట్టునున్న పువ్వుల్ని లెక్కపెట్టకూడదంటారు. నక్షత్రాలు లెక్కలేనన్ని-యింతేనా సమాధానం" అన్నాడు కొత్తవ్యక్తి.

"సెభాష్! సెభాష్! నేవ్రాసింది చదువు మంత్రీ!" అని ఆజ్ఞాపించాడు మహారాజు. "నక్షత్రాల్ని ఎవరూ లెక్కపెట్టలేరు. కాని సహేతుకంగా లెక్కలేనన్ని నిరూపించాలి. యిదే సమాధానం" అని మంత్రి మహారాజు వ్రాసినదాన్ని చదివాడు. రాఘవేంద్రుడు లేచి నుంచొని "మే మనుకొన్నట్టుగా యితడు రెండు ప్రశ్నలకూ సరియైన సమాధానం చెప్పాడు. కనుక యితనికి నాకుమార్తె నిచ్చి వివాహం-యీ రాజ్యాన్నిచ్చి పట్టాభిషేకం త్వరలో చేస్తాను" అన్నాడు. అది వినగానే సభలో 'జేజేలు' హర్షధ్వానాలు మరొకసారి మిన్నుముట్టాయి. ఈ వార్త అప్పటికప్పుడే అంతఃపురంలో వున్న సురేఖకు పరిచారికద్వారా తెలిసింది. పాపం! ఆమె వెక్కి-వెక్కి ఏడ్వసాగింది.

సభలో మహారాజు "నాయనా! యిప్పుడైనా నీ వూరు-పేరు చెప్పు" అన్నాడు. "నేనొక సేనాధిపతి కొడుకును. మూడు నెల్లక్రితం దండయాత్రలకెళ్ళి యిప్పటికి పదకొండు రాజ్యాల్ని జయించి వస్తున్నాను" అన్నాడా కొత్తవ్యక్తి. "ఆఁ! అంతటి ధీరుడవా! నీలాంటి అల్లుడు దొరకటం నా అదృష్టం. నీ పేరు కూడా వినిపించు" అన్నాడు ఒళ్లు తెలియని ఆనందంలో మహారాజు. "నా పేరు రఘువీర్!"అంటూ ఆ వ్యక్తి తను వేసుకొన్న మారువేషాన్ని తీసివేశాడు. అది చూచి అదిరిపడ్డాడు రాఘవేంద్రుడు. అంతవరకు నిశ్చేష్టుడై చూస్తున్న రఘువీర్ తండ్రి జయవీర్ "నాయనా! నీవేనా!" అంటూ కొడుకును కావలించుకున్నాడు. "యువరాజు-రఘువీర్ కీ జై!" అంటూ నినాదాలు సభలో చెలరేగాయి. మహారాజు తలవంచుకున్నాడు. నెమ్మదిగావచ్చి జయవీరుని చేతులు పట్టుకొని "నన్ను క్షమించు! జయవీరా! యిక నేను సంతోషంగా నీ కుమారుణ్ణి నా అల్లుడుగా స్వీకరించి-ఈ రాజ్యాన్ని అతనికే తప్పగిస్తాను"అన్నాడు. జయ



'ఆరెరే! నా గుండెకాయ!'

చిత్రకారుడు—శ్రీ కె. సత్యనారాయణ (జగదల్ పూర్)

# వింత షరతులు

వీర్ కేమీ అర్థం గాకపోయినా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

సరియైన సమాధానాలు చెప్పింది రఘువీర్ అని తెలియక - అతను కానపుడు తను బ్రతకడ మెందుకను కొని-సురేఖ తన చేతి వుంగరపు వజ్రాన్ని పొడిచేసి - నీళ్లలో కల్పి త్రాగబోతోంది-ఆ సమయానికే ఎప్పుడక్కడకు వచ్చాడో కాని-రఘువీర్-ఒక్క వుదుటున సురేఖ త్రాగబోతున్నదాన్ని లాగుకున్నాడు. అతన్ని చూచీచూడగానే - కౌగలించుకొని 'బావురు'మని ఏడ్చింది. సంగతంతా చెప్పి ఆమెను ఓదార్చాడు రఘువీర్. ఆమె చాలా సంతోషించింది.

ఒక శుభముహూర్తాన సురేఖ-రఘువీర్ల వివాహం, రాజ్యపట్టాభిషేకం జరిపించాడు రాఘవేంద్రుడు మహావైభవంగా.

ఆ తర్వాత ఖైదులోవున్న జయచంద్రుణ్ణి-అటువంటి వాళ్లనే మరిద్దరినీ చూచి ఆశ్చర్యపోయాడు-రఘువీర్. ఖైదులోవున్న ఎనమండుగుర్ని విడుదలచేసి-సత్కరించి ఎవరి దోవన వారిని పంపేశాడు. పిమ్మట తను జయించిన రాజ్యాల్ని తిరిగి ఎవరివి వారికి యిచ్చివేశాడు. అటు పిమ్మట ప్రజానురంజకంగా రాజ్యాన్ని పాలిస్తూ సురేఖతో హాయిగా కాలం గడిపాడు-రఘువీర్. ★

# ఫలించిన కల

(11-వ పేజీ తరువాయి)

'రేపుదయం వేళ విజయవాడ. మా అక్కయ్య యింటికి సెలవులకు వెళ్ళుతున్నాను.'

'మీ రేం చదువుతున్నారు?'

'ప్రి యూనివర్శిటీ పరీక్షలకు వెళ్లాను.'

'మీ పేరు.'

'అనూరాధ' అంది సిగ్గుతో.

'అయితే నాతోబాటు మీరు కూడా విజయవాడవరకు వస్తారన్నమాట.'

'నేను కొంచెము కునుకుతీసినా సామానుకు భయం లేదు' అన్నాడు, పెట్టె మీదకు జారగిలబడి. రైలుతో పోటీపడుతున్నాయి ఆలోచనలు. నిమిషకాలంలో అవి భూలోకపు సరిహద్దులను దాటివేసినాయి.

రైలు ఆగింది. స్టేషను జనసమ్మర్దంతో హడావిడిగా ఉంది.

'ఏమండీ విజయవాడ వచ్చిందండీ' అంది అనూరాధ.

ఉలిక్కిపడి లేచాడు. 'చాలా థాంక్స్ మీరు లేపకపోతే నేనిట్లాగే వెళ్ళిపోయేవాడిని' అని లేచినుంచున్నాడు సూట్‌కేసు హ్యాండ్ బ్యాగ్‌తో.

> రోగి—ఏమండీ, డాక్టరుగారు ఉన్నారా?
>
> కంపౌండరు-లేరండి. ఆయన భార్యకు పురుడువచ్చే సమయం. అందుకని లేడీ డాక్టరు కోసం పరుగెత్తుకొని వెళ్లారండి.
>
> —నేమాని కాశీ విశ్వేశ్వరరావు, (కాకినాడ.)

'మీకోసం ఎవరైనా స్టేషనుకు వస్తారా?'

'అరుగో నాన్నగారు వచ్చారు.'

'మరైతే సెలవ్ వస్తానండి' అంటూ పెట్టె దిగాడు రాము.

'ఎంతమంచివారు' అనుకుంది సామానుతో బయటపడ్డారు.

* * *

అప్పుడే రిక్షాలోనుంచి దిగుతున్న రామును చూసి 'అమ్మా అన్నయ్య వచ్చాడే' అంటూ కేకపెట్టి పరుగెత్తుకుంటూ బయటకు వచ్చాడు చిన్న తమ్ముడు.

'అన్నయ్యా, అన్నయ్యా! సంచి నాకివ్వరా నే పట్టుకొస్తా' అంటూ చేతిలోంచి లాక్కున్నాడు. సంచి వాడికిచ్చి నవ్వుతూ లోపలికి ప్రవేశించాడు.

'వచ్చావా నాయనా' అంటూ పలుకరించింది తల్లి ఆప్యాయంగా తల నిమురుతూ.

'ఏరా మరీ బొత్తిగా ఎండిపోయావు. ఏమి హోటలు భోజనము ఏమిటో' అంది బాధను [illegible]కించేస్తూ. ఆ మాతృమూర్తి హృదయంలోని చల్లదనం, ఆ పలుకరింపులోని ఆప్యాయత అవ్యక్తానందాబ్ధిలో ముంచివైచినాయి. నవమాసములు మోసి కని, కష్టపడి పెంచి పెద్దచేసిన ఆ మాతృదేవతకు ఎవరు సాటి అనుకున్నాడు. మనస్సులో నమస్కరించాడు.

'ఎలా ఉందమ్మా నీ ఒంట్లో? ఏమిటి అనారోగ్యం? డాక్టరుగారు రోజూ వస్తున్నారా? సరైనమందు తీసుకొంటున్నావా? కొంచెము పని తగ్గించుకోకూడదమ్మా. విశ్రాంతి లేకుండా ఆరోగ్యం ఎట్లా చేకూరతుంది?' అంటూ ప్రశ్నమీద ప్రశ్న కురిపించాడు తన ఆదుర్దా వ్యక్తపరుస్తూ.

'ఫరవాలేదు నాయనా కొంచెము కులాసాగానే ఉంది ఇప్పుడు. పూర్తి విశ్రాంతి కావాలంటాడు డాక్టరు.'

మౌనం వహించాడు రాము.

'ఏరా ఎంతసేపైంది వచ్చి' అంటూ పలుకరించాడు తండ్రి లోపలికి వస్తూ.

'ఇంతకుముందే.'

'ఉత్తరంఅన్నా వ్రాయటం మానుకొన్నావు. అంత తీరుబడి లేకుండా ఉందా' అన్నారు ప్రశ్నార్థకంగా జవాబులేని ప్రశ్న అని తెలిసి ఉండీ కూడా.

'వాడికి కొంచెము కాఫీ అన్నా కలిపియ్యి. ఎప్పుడు త్రాగాడో' అన్నారు తండ్రి.

'వాడితోపాటు మీరు మళ్ళీ త్రాగవచ్చునా!'

'అవును వాడితోపాటు నాకూ మంచి కాఫీ వస్తుందని.'

'అవ్వ చూడరా నేను మంచి కాఫీఅన్నా ఇవ్వటం లేదనేగా వారి ఫిర్యాదు?'

'అని నే నన్నానా. గుమ్మడికాయ దొంగ ఎవరంటే భుజాలు తడుముకున్నాడట వెనుక ఒకాయన. అట్లా ఉంది.'

'ఉండండమ్మా మీ ఇద్దరికీ నేను మంచి కాఫీ కలిపి ఇస్తాను.' అన్నాడు రాము.

'కోడలు వచ్చాకనా' అన్నారు ఒకేసారి ఇద్దరూ నవ్వుతూ.

రెండురోజులు అవలీలగా తల్లిదండ్రుల ప్రేమానురాగాలతో ఆదరాభిమానాలతో గడిచిపోయినాయి.

'ఏరా ఎన్నాళ్ళని ఇట్లా సత్రం భోజనం మఠం నిద్రతో గడుపుతావు. నీ ఆరోగ్యం చూస్తే ఏమీ బాగుండటంలేదు. అట్లా ఉంచి మేమూ పెద్దవాళ్ళ మవుతున్నాము' అంటూ ఆగింది రామువైపు చూస్తూ సందేహిస్తూ.

'ఈ ఉపోద్ఘాత మంతా దేనికో తెలుసు లేమ్మా' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

'అవునురా ఎన్నాళ్ళని ఇంకా పెళ్ళి చేసుకోకుండా ఉంటావు?'

'చేసుకుంటానమ్మా. చేసుకోనన్నానా నేను. కాని—'

'కాని ఏమిటిరా. ఇంకా కొంతకాలము ఆగమంటావు. అంతేనా?'

'అదేలే అమ్మా. మంచి పిల్లను చూడు

నీకు నాకు నచ్చేటట్లుగా' అన్నాడు హాస్య ధోరణిలో.

'ఇంకా చూడట మేమిటిరా. చూసే ఉంచాను. గవర్నరుపేటలో రాజ్యలక్ష్మమ్మగారని ఉన్నారు. వాళ్ళమ్మాయి ఉంది. చక్కనిచుక్క. గుణవంతురాలు. కాలేజీలో చదువుతోంది. ఎప్పుడు వెళ్ళినా అత్తయ్యా అత్తయ్యా అని ఆప్యాయంగా వెంటబడి తిరుగుతుంది. తండ్రి డాక్టరు. పాపం ఆవిడ కూడా నీ ప్రసక్తి ఎన్నోసార్లు తీసుకొనివచ్చింది.'

'నాకంటే ముందరే నీకు కావలసిన పిల్లను సెలెక్టుచేసుకున్నావన్నమాట. నీకు నచ్చితే నాకు నచ్చుతుందమ్మా!'

'ఏం ఎందుకు నచ్చదు? నిక్షేపంలాంటి పిల్ల. అందం తక్కువనా, గుణం తక్కువనా, హోదా తక్కువనా నచ్చకపోవటానికి.'

'సరేలే అమ్మా' అన్నాడు అప్పటికి ఆ సంభాషణ నిలిపివేసే ఉద్దేశంతో.

'సరేలే అంటే కాదు. రేపు మంచిది చూడటానికి వస్తున్నామని కబురుచేశాను.'

'ఎందుకమ్మా అంత తొందర? మళ్ళీ వచ్చినప్పుడు చూడవచ్చులే. ఇంకా ఎక్కడైనా మంచిపిల్లలు ఉన్నారేమో తెలుసుకొని ఉంటే ఈసారి పదిరోజులపాటు సెలవుపెట్టి వస్తాను. అప్పుడు ఈ పనిమీదే ఉంటాను.'

'ఏం నవ్వులాటగా వుందిరా నీకు' అంది తీక్షణంగా.

'ఏమైనా సరే రేపు వెళ్ళి చూసిరావలసిందే' అంది మళ్ళీ నిశ్చయంగా.

'అట్లాగే నీ ఇష్టం' అన్నాడు తల్లిని నిరుత్సాహ పరచటం ఇష్టంలేక. విజయసూచకంగా చిరునవ్వు నవ్వింది తల్లి.

రాజ్యలక్ష్మమ్మగారిల్లు హడావిడిగా ఉంది. 'వాళ్ళు వచ్చే వేళయింది నీ అలంకారము పూర్తికానీ' అని హెచ్చరిక చేస్తోంది కూతురుకు.

'రండి బావగారూ మీ కోసమే ఎదురుచూస్తున్నాం అంటూ' ఆహ్వానించారు డాక్టరు హనుమంతరావుగారు.

కుశల ప్రశ్నలతో కొంతసేపు సంభాషణ నడిచింది.

'ఏం నాయనా నీవు ఇప్పుడు విశాఖపట్నంలోనేనా పనిచేస్తోంది' అని ప్రశ్నించాడు హనుమంతరావుగారు.

'అవునండీ' అని ముక్తసరిగా జవాబిచ్చాడు రాము.

'పిల్చు అమ్మాయి అనూరాధను తీసుకొనిరా' అన్నారు ఆయన.

అనూరాధ పేరు వినపడగానే ఉలిక్కిపడ్డాడు. వెంటనే సంబాళించుకుని ఆలోచనాసముద్రంలో మునిగిపోయాడు రాము.

'ఆహా - అనూరాధే నాకు జీవితభాగస్వామిగా లభిస్తే నేనెంత అదృష్టవంతుణ్ణి' అనుకొన్నాడు.

ఆలోచనవలన కలిగిన పరాకువల్ల ఎవరు వచ్చినదికూడా గమనించలేదు.

అనూరాధ తలవంచుకుని కూర్చుంది.

'ఏమిటమ్మా నీపేరు' అని ప్రశ్నించారు రాము తండ్రి పేరు తెలిసినప్పటికీ.

'అనూరాధ' అంది తలెత్తి.

రాము ఆమెవైపు చూచాడు. సంభ్రమాశ్చర్యములతో దిగ్భ్రమచెందాడు. కలో లేక నిజమో అర్థంకాలేదు. మళ్ళీ పరీక్షగా చూచాడు. అనూరాధ కూడా తలెత్తి క్రీగంట చూచింది. నివ్వెరపాటు చెందింది. మనసులోని భావాలకు ఆలోచనలకు అంతులేదు. సిగ్గులో బుగ్గలు కెంపువర్ణము దాల్చగా గులాబిమొగ్గవలె ముడుచుకుపోయిందిఅనూ.

'ఒకపాట పాడమ్మా' అంది రాము తల్లి.

'అక్కరలేదమ్మా' అన్నాడు రాము. ఆమెకు అర్థంకాలేదు. ఎందుకీ విముఖత పిల్ల నచ్చలేదా అని తర్కించుకొంది.

ఫలహారాలు కాఫీ ఏర్పాటుచేశారు.

అనూరాధ తమ్ముడు తన చిన్న కాఫీ గ్లాసుతో వస్తూ 'మొన్న నాకు రైలులో కాఫీ ఇప్పించారే ఆ అబ్బాయే' అన్నాడు రామువైపు చూపిస్తూ.

ప్రశ్నార్థకంగా ఒకరి ముఖంవంక మరొకరు చూచుకున్నారు ఏమీ అర్థంకాక. జరిగిన సంగతి క్లుప్తంగా వివరించాడు రాము.

'ఎంతటివాడవురా నీవు. నే నేదో నాకు నచ్చిన పిల్లను నేను నిర్ణయించుకొన్నానన్నావు. మరి మాకు ఎవరికీ తెలియకుండానే నీవు నిర్ణయించుకోవటంలో ఉద్దేశం' అంది కోపం అభినయిస్తూ తల్లి.

రాము ముసిముసిగా నవ్వాడు సమాధానంగా.

పెళ్ళి నిర్ణయమైంది. వారంరోజులలోనే ముహూర్తం ఉండటంవల్ల పదిహేనురోజులపాటు సెలవు పొడిగించుకున్నారు. వివాహ ఆహ్వానపత్రిక పంపిస్తూ సెలవు దరఖాస్తు కూడా జతపర్చాడు. వివాహం సకల మర్యాదలతో ముగిసింది.

గది అంతా శోభాయమానంగా అలంకరించబడినది. ఎటుచూచినా వివిధములైన చిత్రపటములతో నిండివుంది. అగరువత్తుల నుండి వెలువడుతున్న పొగలు వలయాకారంగా తిరుగుతూ తెరలు తెరలుగా వ్యాపిస్తున్నాయి, సువాసనలు వెదజల్లుతూ. మంచంమీద కూర్చొని కృష్ణుడు రాధ కొంగును పుచ్చుకొని లాగుతున్న దృశ్యంవైపు చూస్తూ ఆలోచిస్తున్నాడు. తలుపు చప్పుడైంది. అనూరాధ తలవంచుకొని తలుపు దగ్గర నిలబడింది. బయట గొళ్ళెం పెట్టిన శబ్దము వినవచ్చింది. దగ్గరకు వచ్చి గడ్డం పుచ్చుకొని 'అనూ' అంటూ తనవైపుకు త్రిప్పుకొన్నాడు. తీయగా ఆమె కళ్ళలోకి చూచాడు. ఒకరి నొకరు చూస్తూ నిలుచుండిపోయారు, తన్మయత్వంలో కొన్ని క్షణాల పాటు. తీయని కబుర్లతో నవ్విస్తున్నాడు. ఇంతలో ఏదో గుర్తుకువచ్చి తనలో తను నవ్వుకొన్నాడు.

'ఏమండీ మీ రొక్కరే ఎందుకు నవ్వుకుంటున్నారు. నా అందం చూశా. పోనీలేండి నేనంత అందంగా లేకపోతే మాత్రం నవ్వాలా' అంది ప్రణయకోపం నటిస్తూ.

'అదికాదు అనూ! నాకు కొద్దిరోజులక్రింద వచ్చిన కలగురించి. నాకు కలలంటే నమ్మకం లేదు. కలలన్నీ కల్లలని వాదించేవాడిని.' అని తనకు వచ్చిన కలగురించి వివరించాడు.

'అయితే కలలు నిజమవుతాయా? ఏది ఏమైనా మనవిషయంలో మాత్రం నిజమైంది.'

'అవునండీ. నాకు ఆరోజు రైలులో మిమ్మల్ని కలుసుకొనిన తరువాత ఒక కల వచ్చిందండి. నాకు తెలియకుండా ఎవరో నా హృదయాన్ని దొంగిలించారట. నేను ఆ దొంగను పట్టుకునేందుకు విశ్వప్రయత్నం చేశాను కాని చివరకు—'

'నీ హృదయం నీ దగ్గర ఉందో లేదో నేను చూస్తానుగా వుండు' అంటూ దగ్గరకు తీసుకున్నాడు రాము అన్వేషించే ప్రయత్నంలో. "ఇదిగో దొరికింది. నీ కల నా కల రెండు ఫలించాయి. ఈ రోజు" అన్నాడు ఆమె పెదవులను ముద్దుపెట్టుకుంటూ. కిటికీగుండా దొంగతనంగా తొంగి చూస్తున్న చందమామ సిగ్గుపడి మబ్బులచాటుకు పోయి దాక్కొన్నాడు. ★

విజయలక్ష్మి [illegible] చిత్రంలో తార

# సుమ
# వనమందలి
# సూర్యకాంత
# ప్రతిభాన్వితమో
# మీ సౌందర్యం

స్త్రీ- కృతకోరిక ఆ కోమ రెక్కలు
ముడిగ ముడిచినది ... అగమనం
వల్లనే — ఆ కమనీయమే ఏ
రూపలావణ్యంతో సంపూర్ణ సంతుష్టి పొం
దడంలో అమృత భాండము తంగి, ఏ
హృదయ పంకమున ఉద్భవించునే!
మనోహర చర్మ సౌందర్యం వల్లనే
సంపూర్ణ సొగసు కలుగును అని సినీమా
తార విజయలక్ష్మికి తెలియును. ఆమె ఇలా
చెప్పుచున్నది, 'అందుచేతనే నేను
సౌమ్యమగు లక్స్ వాడుచున్నాను.'
మీరెందుకు వాడగూడదు?




సినీమా తారలకు సౌందర్యము నిచ్చే
శుద్ధమైన, సౌమ్యమగు నబ్బు

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

LTS 74-X52 TL

# న్యూఢిల్లీ లేఖ

...పై ముఖ్యానికి మూలకారణం ఇదే.

## హిందీవాదుల దాడి

ఇవన్నీ ఇలా ఉండగా హిందీసామ్రాజ్య వాదులు ఒక దండయాత్ర తలపెట్టారు. కేంద్రప్రభుత్వ అధికారభాషగా హిందీ ప్రవేశపెట్టడానికి సత్వర చర్యలు జరపాలని కోరుతూ రాజ్యసభ సభ్యుడు శ్రీ నవాబ్ సింగ్ చౌహాన్ ప్రశ్నల పరంపర కురిపిస్తున్నారు. ఆయనవేసే ప్రశ్నలు ఇలా ఉంటున్నవి:

(అ) లెటర్ హెడ్స్, సీల్సు మున్నగు వాటిని హిందీలో తయారు చేశారా?

(ఆ) ప్రభుత్వానికి హిందీలో వచ్చిన లేఖలసంఖ్య, హిందీలో పంపిన సమాధానాల సంఖ్య చెప్పండి.

(1959 లో కేంద్ర వాణిజ్య శాఖకు హిందీలో 6,900 లేఖలు చేరగా 5,000 లేఖలకు హిందీలో సమాధానాలు పంపారు. ఇందుకు అదనంగా హిందీ తెలిసిన ఉద్యోగులను నియమించవలసి వచ్చినది.)

(ఇ) ఒకటి, రెండు, మూడవ తరగతుల ఉద్యోగులలో హిందీ తెలిసిన వారిసంఖ్య చెబుతారా?

(వాణిజ్యశాఖలో మొదటి తరగతి ఉద్యోగులు 354 మందిలో 119 మంది; రెండవ తరగతివారు 1,127 మందిలో 618 మంది; మూడవ తరగతివారు 4,404మందిలో 1,798 మంది హిందీ తెలిసినవారు)

ఈ దండయాత్ర లక్ష్యం ఒక్కటే. అయితే హిందీ నేర్చుకోండి; లేకపోతే చావండి—అనే.

హిందీ విషయంలో రాష్ట్రపతి జారీ చేసిన ఉత్తర్వు అమలుగురించి పార్లమెంటు ఉభయసభలలోను ప్రశ్నలు వేయడం జరిగినది. సేఠ్ గోవిందదాస్ అస్సాం వెళ్ళడానికిబదులుగా రాజధాని నగరంలో ఉండి ఈ దండయాత్ర నడిపిస్తున్నారు. ★



చదరంగం:

# గుర్రానిచ్చి ఆటకట్టిన నేర్పు!

దేశంలోని ప్రముఖ ఆటగాళ్లలో శ్రీ పి. తిలక్ (ఆంధ్ర) ఒకరు. ఆయన ఆట పద్ధతి కూడా విశిష్టమైనది. ప్రారంభంలో రక్షణకే ప్రాధాన్యమిస్తారు. అదనుచూచి స్థానబలం సంపాదించడానికి ఒడుపుగా యత్నిస్తారు. ఎదుటివాడు పొరపాటుచేసినా తగు జాగరూకత ప్రదర్శించకపోయినా విజృంభించి అవలీలగా విజయం సాధిస్తారు.

ఇటీవల ఢిల్లీలో జరిగిన జాతీయ చదరంగం ఛాంపియన్‌షిప్ టూర్నమెంటులో శ్రీ బీరేన్ బోస్ (బెంగాల్)తో పోటీలో స్థానబలం సంపాదించడంకోసం శ్రీ తిలక్ గుర్రం ఇచ్చివేశారు. 37 ఎత్తులలో శ్రీ బోస్ ఆటను కట్టించారు.

ఆ ఆట సాగినక్రమం ఇది:

శ్రీ పి. తిలక్—తెలుపు; శ్రీ బీరేన్‌బోస్—నలుపు.

'క్వీన్ పాన్ (మంత్రి బంటు) ఓపెనింగ్'

1. బ-మం 4; గు-రాశ 3.
2. గు-రా శ 3; బ-రా [illegible]
3. శ-గు 5; శ-రా 2.
4. బ-రా 3; 0-0 (రాజావైపు కోట).
5. బ-మం శ 4; బ-మం 4.
6. గు-శ 3; బ-శ 4 (అ).
7. శ-మం 3; మం-గు 3.
8. మం-శ 2; బ-రా ఏ 3.
9. బ-రా ఏ 4! (ఆ); గు-శ 3.
10. బ×శబ; మం×బ.
11. శ×గు; శ×శ.
12. బ-మం ఏ 3 (ఇ); బ×బ.
13. శ-రా 2; బ-మంగు 4 (ఈ).
14. గు-రా 4; మం-రా 2
15. బ-రా గు 4; బ-రా 4 (ఉ).
16. గు (4)-గు5 (ఊ); బ×గు.
17. గు×బ; బ-శ 4 (ఎ).
18. బ-శ 4; శ-శ 3.
19. శ-శ 3; మం-శ 4.
20. రా-శ 2; శ×గు.
21. ఏబ×శ; రా-శ 2.
22. బ-గు 4; మం-గు 3.
23. బ-గు 6 షా (ఏ); రా-రా 2.
24. మం-శ 3; ఏ-గు 1.
25. ఏ-ఏ 7; రా-శ 1.
26. ఏ (1)-ఏ 1; శ-గు 2.
27. ఏ×బ; బ-రా 4.
28 ఏ-శ 7 షా; రా-రా 1.
29. శ×గు షా; మం×శ.
30. మం×బ షా; రా-మం 1.
31. ఏ-మం 1 షా; రా-శ 1.
32. మం×బ షా (ఐ); రా-గు 1.
33. మం-రా 5 షా; రా-శ 1.
34. ఏ-మం 5; ఏ-రా 1.
35. ఏ-శ 7 షా; రా-గు 1.
36. ఏ-మం 8 షా; ఏ×ఏ.
37. ఏ×మం (తెర-చిరాజా);

నలుపు ఓటమి అంగీకరించినది.

(అ) నలుపు బలం కోల్పోయే ప్రమాదం ఉండడంచేతను, కేంద్రంలో తెలుపుకు స్థానబలం చిక్కే అవకాశం ఉన్న కారణం చేతను ఈ ఎత్తు వేయడం మానివేశారు. దీనికన్న బ-శ 3 మేలు (ఇడిస్లావ్ పద్ధతి).

(ఆ) ఇది నల్ల బలానికి ఆశ్చర్యం కలుగచేసే ఎత్తు. 9...బ×శ. 10. బ×బ అయితే తెల్ల బలానికి రక్షణ లేకుండా పోతుంది.

(ఇ) గు-గు 5 ఎత్తు రాకుండా నిరోధించడానికి ఉపాయం. లేకపోతే ఆట పోతుంది.

(ఈ) అంతకన్నా మంచిపద్ధతి ఇది: 13. శ×గు. 14. మం×శ; బ-మంగు 4. ఏమంటే 14. గు-రా 4 అయితే నల్లబలం ఆత్మరక్షణలో మునిగిపోతుంది.

(ఉ) రాజావైపు దాడి నిరోధించడానికి ఇది తోడ్పడదు. ఏమైనా నలుపు శ-రా 4 బదులుగా గు-రా 4 ఆడిఉండవలసినది.

(ఊ) ఇది నిజంగా సాహసం! మొదట్లో ఎదిరిపక్షం బంటువులు దొరకక పోయినా ముందు ముందుస్థానబలం లభిస్తుంది. కనుక త్యాగంచేయడం ఉత్తమమని భావించడం జరిగినది.

(ఎ) బ-గు 3 అయితే రక్షణకు అనుకూలంగా ఉండేది.

(ఏ) ఇక్కడినుంచి నలుపుబలం నిర్బంధంగా ఎత్తులు వేయవలసినస్థితి. తప్పించుకొనడానికి మార్గంలేదు.

(ఐ) నిరర్థకం. ఏ-మం 5 శ్రేష్ఠం.

—వి. విశ్వనాథశాస్త్రి.

# పొట్టి కథలు

## రెండోది కూడా....

ఓక దగ్గర 'పారిజాతాపహరణం' హరికథ కుంటివాడి నడక లాగా సాగిపోతోంది. ఒకరిద్దరు కుర్రకారువాళ్లు కథను చాలించమని అరచినా ఆ హరిదాసు చెవినిపెట్టక సీరియస్‌గా చెప్పుకుపోతున్నాడు. ఇది భరించలేని ఓ నవనాగరికుడు తన కాలికున్న చెప్పుల్లో ఓ చెప్పు ఎవరూ చూడకుండా హరిదాసుమీదికి విసిరాడు. అది వెళ్లి తిన్నగా హరిదాసు చెంపలను ముద్దెట్టుకుంది. ఇది చూచి ఆ హరిదాసు కొంత విచలితుడై కథను ఆపినా బింకంగా ఇలా అన్నాడు!

"బాబ్బాబు-రెండోది కూడా ఇలా విసరండి, స్వామీ! ఇలాంటి చెప్పులు తొడుగుకోవాలని ఎన్నాళ్లనుంచో మనసుగా ఉంది!"

అది వినగానే అక్కడున్న ప్రజ అంతా గొల్లుమంది. చెప్పు విసిరిన చిలిపి కుర్రాడి మొహం మాత్రం తెల్లబోయింది.

ఆర్. వేణుగోపాలరావు (అద్రా)

* * *

ఉపాధ్యాయుడు: (పాఠం చెబుతూ) అశోకుడు రోడ్లు వేయించెను......

విద్యార్థి: అబ్బ! అంతపెద్ద పెనం ఎక్కడిదండీ?

* * *

నలుగురు పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. 'ఒకడు' హఠాత్తుగా విరగబడి నవ్వాడు. తనతోబాటు ఎవరూ నవ్వక పోవడం చూచి, 'ఎవరూ నవ్వరేం?' అన్నాడు.

మరొకడు: ఎందుకు?

మొదటివాడు: విట్టువేస్తేను నేను...!

అప్పుడంతా విరగబడి నవ్వారు.

* * *

ఒక గొప్పవాడు: బ్రతికున్నంత కాలమూ గొప్పతనాన్ని గుర్తించకుండా చనిపోయినతరువాతసంతాపసభలు ఏర్పాటు చేయటం నాకేమీ నచ్చలేదోయ్.

మిత్రుడు: అయితే నీకు ఇప్పుడే ఏర్పాటు చేయించమంటావా?

కొడవరపు భాస్కరరావు(కోలవెన్ను)

* * *

తాడేపల్లి గూడెం రైల్వే స్టేషన్‌లో ఒకడు-టికెట్లిచ్చే గుమాస్తా మీరేనటయ్యా?

గుమస్తా: మరేనండి!

ఒ: రాజమండ్రి గోదావరికి టికెట్టు ఎంత కమ్ముతున్నారండీ?

గు: పదణాల కాని.

ఒ: పావలా అర్ధణాకిస్తారా!

గు: అవతలికిపో, బ్రూట్!

ఒ: ఛీ! ఛీ! ఇక్కడన్నీ ప్రియమే. బజారులోనే నయం.

—పద్మాకర

* * *



చిత్రకారుడు—
శ్రీ ఆర్. వి. ఆనందరావు (మద్రాసు)

## అక్షరాభ్యాసం

ఉపాధ్యాయుడు— ఒరేయి, రాముా, నేను ఎలా చెబితే అలా అనాలిరా.

రామూ—ఓ! అలాగేనండి!

ఉపా—ఓం! అనరా.

రాముా—ఓం! అనరా

ఉపా—అనరా ఎందుకురా వెధవా?

రాముా—అనరా ఎందుకురా, వెధవా?

ఉపా—ఛీ! నువ్వు ఎందుకూ పనికి రావు.

రాముా-ఛీ! నువ్వు ఎందుకూ పనికిరావు.

—పి. వి. చలపతిరావు (భిలాయ్

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd., by S. Radha Krishna at TheAndhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మరియు ఫేస్ పౌడరు వాడి అందాల భరిణగా కనపడండి

మొదట, తేలికైన మరియు మంచువలె ఉన్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును రాసుకోండి. అది మీ సున్నితమైన ముఖ చర్మమునకు రక్షణనిచ్చి దానిని మృదువుగా, మనోహరముగా ఉండేలా ఉంచుతుంది. జిడ్డులేని యీ క్రీము ముఖముమీద చిన్నచిన్న కళంకములను కనపడకుండా ఉంచుతుంది మరియు పౌడరును అంటుకొని ఉండేలా చేస్తుంది!

తరువాత, మెత్తని పాండ్స్ ఫేస్ పౌడరును తేలికగా పైపైన అద్దుకోండి. అది మీ ముఖముయొక్క రంగులో కలిసిపోతుంది మరియు దానికి శోభను చేకూరుస్తుంది!

ప్రతి సారి పైవిధముగా చేస్తే మీరు గంటలతరబడి అందముగా కనబడతారు!

ప్రపంచమంతటా సౌందర్యవతులు వీటినే ఎన్నుకొంటారు







చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో స్థాపించబడినది)

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.